


## — / ప్రచురణములు / —

| | | |
|---|---|---|
| 1. | సాహిత్య సౌందర్య దర్శనము (సమగ్రాలంకార దర్శనము) | రు॥ 35-00 |
| 2. | కావ్యాదర్శము (పద్యానువాదము : దండి) | 2-50 |
| 3. | లఘుపంశలహరి (పద్యములు : కాళిదాసు) | 10-00 |
| 4. | కుమారస్వామి విజయము (పద్య గద్యములు) | 4-00 |
| 5. | బుద్ధభగవానుని చరిత్ర (పద్య గద్యములు) | 4-00 |
| 6. | బ్రహ్మమీమాంసాదర్శనము | 10-00 |
| 7. | న్యాయమీమాంసాదర్శనము | 4-00 |
| 8. | వైశేషికదర్శనము | 4-00 |
| 9. | సాంఖ్యమీమాంసాదర్శనము | 6-00 |
| 10. | సిద్ధాంత తత్త్వదర్శనము | 6-00 |
| 11. | మహాభారత మీమాంస (1వ భాగము) | 4-00 |
| 12. | మధుర శాకుంతలము (నాటకము) | 6-00 |
| 13. | ఉత్తరరామ ప్రణయచరిత్ర (నాటకము) | 5-00 |
| 14. | ఉపనిషత్సుధ 1వ భాగము (మూల తాత్పర్య పద్యానువాదము) | 5-00 |
| | ,, 2వ భాగము | 5-00 |
| | ,, 3వ భాగము ఛాందోగ్యము | 30-00 |
| | ,, 4వ భాగము బృహదారణ్యకము | 20-00 |


చర్ల గణపతిశాస్త్రి,
33, కిర్లంపూడి కాలనీ,
ఆంధ్రా యూనివర్సిటీ,
వాల్తేరు - 3.

# గౌడపాదీయ కారికలు

గౌడపాదాచార్యులు





## చర్ల గణపతిశాస్త్రి

వెల — రూ॥ 5-00

త్రిషుధామసు యద్భోజ్యం, భోక్తాయశ్చ ప్రకీర్తితః
వేదై తదుభయం యస్తునభుంజానోన లిప్యతే. 5

జాగ్రత్స్వప్న సుషుప్తులన్ భోజ్యమే దేదిభోక్తయో
ఈరెంటిన్ దెలియువాఁడు, భుజియించుచు నంటడు.

ప్రభవస్సర్వభావానాం సతామితి వినిశ్చయః
సర్వంజనయతి ప్రాణశ్చేతోం శూన్పురుషః పృథక్. 6

నామరూపాదులంగూడి, విశ్వాదుల్ ప్రభవింతురు
అన్నింటికిని బీజంబౌ ప్రాణంబుగూర్చు జీవులన్.

దేవతిర్యఙ్మనుష్యాది దేహంబుల మనోంశలన్
వేర్వేఱగూర్చుఁ బురుషుం డగ్ని నెరసులన్ బలెన్.

విభూతిం ప్రసవంత్వన్యే మన్యంతే సృష్టిచింతకాః
స్వప్నమాయా సరూపేతి సృష్టిరన్యైర్వికల్పితా. 7

వ్యాపించుటె సృష్టియంద్రు, కొందఱు సృష్టిచింతకుల్
మాయనుస్వప్నమున్ బోలున్ సృష్టియందురు కొందఱు.

ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిరితి సృష్టౌ వినిశ్చితాః
కాలాత్ప్రసూతిం భూతానాం మన్యంతే కాలచింతకాః. 8

ఈశ్వరేచ్ఛయె యీసృష్టి, యని స్థిరాత్ములందురు
కాలంబుచే భూతసృష్టి, యగునందురుజ్యోతిషుల్.

భోగార్థం సృష్టిరిత్యన్యే క్రీడార్థమితి చాపరే
దేవస్యైష స్వభావోఽయ మాప్తకామస్యకా స్పృహా. 9

సృష్టి భోగంబుకై యంద్రు, లీలకై యని కొందఱు
దైవ స్వభావ మిద్యది, నిష్కామునికిఁ గోర్కెటుల్.

నివృత్తే స్సర్వ దుఃఖానా మీశానః ప్రభు రవ్యయః
అద్వైత స్సర్వ భూతానాం దేవస్తుర్యో విభుస్స్మృతః. 10

విశ్వాదిరూప దుఃఖంబుల్ పోవ నాల్గవ దేవుడు
ఈశుండై మార్పులేకయె, వ్యాపియై ద్వైత శూన్యడౌ.

కార్యకారణ బద్ధౌతా విష్యేతే విశ్వతేజసౌ
ప్రాజ్ఞః కారణబద్ధస్తు ద్వౌతౌతుర్యే నసిధ్యతః. 11

విశ్వతైజసు లిద్దఱు, కార్యకారణ బద్ధులు
వీరిద్దఱిచుఁ గాంచరు ప్రాజ్ఞుండౌ హేతుబద్ధుడౌ.

వి:- తత్త్వము గ్రహింపకపోవుట, తత్త్వమును మఱొక రీతిగా గ్రహించుట యును కార్యకారణములందు విశ్వతేజసు లిద్దఱు బద్ధులయియుందురు. తత్త్వము గ్రహింపకపోవుట యను కారణమునఁ ప్రాజ్ఞుండు బద్ధుడై యుండును.

నాత్మానం నపరాంశ్చైవ నసత్యం నాపిచానృతం
ప్రాజ్ఞః కించ నసంవేత్తి తుర్యం తత్సర్వదృ క్సదా. 12

తన్నింగాని పరుంగాని, సత్య మసత్య మేనియున్
ప్రాజ్ఞుఁ డేది యెఱుంగడు, దేవుడె సర్వద్రష్టయౌ.

ద్వైతస్యాగ్రహణం తుల్య ముభయోః ప్రాజ్ఞతుర్యయోః
బీజ నిద్రాయుతః ప్రాజ్ఞః సా చ తుర్యే నవిద్యతే. 13

ద్వైతంబున గ్రహింపకుంట, తుల్యంబు ప్రాజ్ఞదేవులన్
బీజ నిద్ర ప్రాజ్ఞుఁజేరు, దేవునం దది యుండదు.

వివ:- తత్త్వమును తెలియకపోవుట నిద్ర, అదే విశేష తత్త్వమును దెలియక పోవుటలో బీజము, అట్టి బీజముయొక్క నిద్ర దేవునందు గలుగ దని భావము.

స్వప్న నిద్రాయుతా వాద్యౌ ప్రాజ్ఞస్త్వస్వప్న నిద్రయా
న నిద్రాం నైవచ స్వప్నం తుర్యే పశ్యంతి నిశ్చితాః. 14

విశ్వతైజసు లిద్దఱు స్వప్నంబునన్ నిద్రఁ గాంతురు
ప్రాజ్ఞుని కొక్క నిద్రయౌ నా రెండున్ దేవుఁ జేరవు.

అన్యథా గృహ్ణత స్స్వప్నో నిద్రాతత్త్వ మజానతః
విపర్యా సేతయోః క్షీణే తురీయంపద మశ్నుతే. 15

తత్త్వ భ్రాంతియె స్వప్నంబు, తత్త్వ జ్ఞానమె నిద్రయౌ
భ్రాంతి యజ్ఞానముల్ పోవ, నాల్గవస్థాన మొందును.

వివ:- త్రాడును పామనుకొనుట, దేహమును ఆత్మ అనుకొనుట భ్రాంతి అదే స్వప్నము, తత్త్వము దెలిసికొనకపోవుట.

అనాది మాయయా సుప్తో యదాజీవః ప్రబుధ్యతే
అజ మనిద్ర మస్వప్న మద్వైతం బుధ్యతే తదా. 16

అనాది మాయ నిద్రించు, జీవుండు తాను మేల్కొని
యజు ననిద్రు, నస్వప్ను, నద్వైతు నాత్మఁ గాంచును.

త్రాడునఁ బాము లేనట్లు, లేని జగత్తు లేనిదౌ
భ్రాంతిచే నున్న దన్నచో, జ్ఞానంబుచే నది చనున్.

ప్రపంచో యదివిద్యేత నివర్తేత నసంశయః
మాయామాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః. 17

ద్వైతబుద్ధిన్ జగంబెల్ల వేఱుచూచుట మాయయే
అద్వైతమె యథార్థంబు, జగంబు లేదు పోవదున్.

వికల్పో వినివర్తేత కల్పితో యదికేనచిత్
ఉపదేశాదయం వాదో జ్ఞాతే ద్వైతం నవిద్యతే. 18

కల్పించుచో నెవండేని, వికల్పముల్ నివర్తిలున్
బోధనంబట్టి వాడుకొ, తెలియం ద్వైత మేదికన్.

వివ:- గురువు శాస్త్రము శిష్యుడు మొదలైన భేద వ్యవహారము మాయా రజ్జు సర్పము వలె భ్రాంతులే గాని వాస్తవములు గావని భావము.

విశ్వస్యాత్వ వివక్షాయామాది సామాన్య ముత్కటమ్
మాత్రా సంప్రతిపత్తౌ స్యాదాప్తి సామాన్య మేవచ. 19

విశ్వుండె అకారమన్న, నది యన్నింటి కాదియౌ
విశ్వుండె అకారమైన, నది వ్యాపించు అన్నిటన్.

వివ:- అకారము కంఠస్థానమునఁ బుట్టినది. కాన అది యన్ని స్థానముల వ్యాపించియుండునని భావము.

తైజసస్యోత్వ విజ్ఞాన ఉత్కర్షో దృశ్యతే స్ఫుటమ్
మాత్రా సంప్రతిపత్తౌ స్యాదుభయత్వం తథావిధమ్. 20

తైజసుం డుకారమన్న, నుత్తమంబది యయ్యెడున్
తైజసుం డుకారమైనన్, మధ్యనుంటయు స్పష్టము.

మకారభావే ప్రాజ్ఞస్య మానసామాన్య ముత్కటమ్
మాత్రా సంప్రతిపత్తౌతు లయసామాన్య మేవచ. 21

ప్రాజ్ఞుండు మకారమన్న, కొలంత కొల్చు రెండిటిన్
ప్రాజ్ఞుండు మకారమన్న, నైక్యమొందును రెండిటన్.

వివ:- విశ్వతైజస రూపములగు అ ఉ అను మాత్రల పరిమాణమును గొలుచుట మకారములో స్పష్టముగానున్నదని భావము. అపుడు అ ఉ అను వాని నాదములు మకార నాదములో నైక్యమొందును అని తెలియవలయును. అ–ఉ–మ్=ఓమ్. విశ్వుడు అకారముగను, తైజసుడు ఉకారముగను, ప్రాజ్ఞుడు మకారముగను బోల్చబడెను. అన్నియుం గలిసిన ఓమ్ అన్నదే మూడింటిని అతీతించిన దేవునికి సూచకమని భావము.

త్రిషుధామసు యత్తుల్యం సామాన్యంవేత్తి నిశ్చితః
స పూజ్య స్సర్వభూతానాం వంద్యశ్చైవ మహామునిః. 22

సమంబుగా నొకటిగా, మూటితావు లెఱింగిన
బ్రహ్మవిదుండు వంద్యుడై, భూతాళిలోనం బూజ్యుడౌ.

అకారో నయతే విశ్వ ముకారశ్చాపి తైజసం
మకారశ్చ పునః ప్రాజ్ఞం నామాత్రే విద్యతే గతిః. 23

విశ్వు అకార మొందించు ఉకారంబది తైజసున్
ప్రాజ్ఞున్ మకార మొందించు ఓమునం గల్గ వేగతుల్.

వివ:- ఓంకార ధ్యానమున అనంత గతియే గాని విశ్వత్వాద్యల్ప గతు లుండవని భావము.

ఓంకారం పాదశోవిద్యా త్పాదామాత్రా నసంశయః
ఓంకారం పాదశోజ్ఞాత్వా నకించిదపి చింతయేత్. 24

పాదాలంబట్టి "ఓమ్" గాంచవలె మాత్రలె పాదముల్
పాదాలంబట్టి "ఓమ్" తెల్సి చింతింపందగ దెద్దియున్.

యుంజీత ప్రణవేచేతః ప్రణవో బ్రహ్మ నిర్భయం
ప్రణవే నిత్య యుక్తస్య నభయుం విద్యతే క్వచిత్. 25

మన స్సోంకారమం దుంచు ఓమ్ బ్రహ్మ భయాంతక
మెప్పు డోంకారమం దున్న వాని కేభీతి లేదెటన్.

ప్రణవో హ్యపరంబ్రహ్మ ప్రణవశ్చ పరః స్మృతః
అపూర్వోఽనంతరోఽబాహ్యోఽనపరః ప్రణవోఽవ్యయః. 23

ప్రణవంచే పరాపర, బ్రహ్మ మయ్యాది క్రొత్తదై
అవ్యయంబయి యొంటిదై, పైనిదై లోనిదై తగున్.

సర్వస్య ప్రణవో హ్యాదిర్మధ్యమస్త దైవచ
ఏవం హిప్రణవం జ్ఞాత్వావ్యశ్నుతే తదనన్తరమ్. 27

ఓమె యన్నింటి కాదియై, మధ్యయై యంతమై తగున్
ఇటు లోంకార మెఱుంగ, నాత్మరూపంబు నొందును.

ప్రణవం హీశ్వరం విద్యాత్సర్వస్య హృది సంస్థితం,
సర్వవ్యాపిన మోంకారం మత్వాధీరో న శోచతి. 28

అందఱ చిత్తమందున్న, యోంకారమె మహేశుఁడు
ఎల్లెడనున్న యోంకార, మెంచ ధీరుండు కుందడు

అమాత్రోనన్త మాత్రశ్చ ద్వైతస్యోపశమశ్శివః,
ఓం కారో విదితో యేన స ముని ర్నేతరోజనః 29

కొల్వరాక, యనంతంబై, యద్వైతమై శివంబునౌ
ఓంకార మెఱుఁగువాఁడు, మునియౌ నన్యు డెట్లగున్

ఇది
మాండూక్యోపనిష ద్వివరణమగు గౌడపాదీయ కారికలందు
అగమ ప్రకరణము.

## వైతథ్య ప్రకరణము

వైతథ్యం సర్వభావానాం స్వప్న ఆహుర్మనీషిణః
అంతస్థానాత్తు భావానాం సంవృతత్వేన హేతునా. 1

భావముల్ మదిలో నుంట, మది సంకోచమౌటచే
కలన్ జూపట్టు భావంబు, అసత్యమంద్రు పండితుల్

వివ :- భావములు కలలోని రథపర్వతనదీ సౌధాది విషయములు.

అదీర్ఘత్వాచ్చకాలస్య గత్వాదేశాన్ నపశ్యతి
ప్రతిబుద్ధశ్చవై సర్వస్తస్మిన్ దేశే స విద్యతే. 2

స్వప్నశృంగాల మల్పంబు, నందెటు పోయి చూడడు
మేల్కొంచి యెల్లవారలు, స్వప్నంబుచోట నుండరు

అభావశ్చ రథా దీనాం శ్రూయతే న్యాయపూర్వకమ్
వైతథ్యం తేనవై ప్రాప్తం స్వప్న ఆహుః ప్రకాశితమ్. 3

కలంగన్పట్టు రథాదుల్, మిథ్యగా యుక్తి దెల్పును
ఇట్టి స్వప్నంపు మిథ్యతన్, శ్రుతి బోధించునందురు

వివ :- నతత్రరథా (కలలో రథములు లేవు) అని శ్రుతి.

అంతస్థానాత్తు భేదానాంతస్మా జాగరితే స్మృతమ్,
తథా తత్ర తథాస్వప్నే సంవృతత్వే నభిద్యతే. 4

భేదభావాలు లోనుంటన్, స్వప్నమందట్లు జాగ్రతన్
సర్వంబు మిథ్య, కలలో, సంకోచమౌటె భేదము

వివ :- జాగ్రదవస్థలో మనస్సు వికసించియుండును. కలలో సంకోచించి యుండును. ఇదే జాగ్రదవస్థకు స్వప్నావస్థకును భేదము కాని స్వప్నావస్థ

యందలి భావములు మిధ్య యైనట్లే జాగ్రదవస్థయందు భేదభావములు మిధ్యలని భావము. ఇందు జాగ్రదవస్థ యందు దృశ్యము లగు భావములు దృశ్యము లగుటవలన అసత్యము లని నిరూపించబడుచున్నది. ఇందులో జాగ్రదవస్థయం దున్న భావములు మిధ్య లనునది ప్రతిజ్ఞ దృశ్య మగుటవలన అనునది హేతువు. స్వప్న దృశ్యములవలె అనునది దృష్టాంతము. స్వప్నమం దెట్లు దృశ్య భావములు అసత్యములో అట్లే జాగ్రదవస్థ యందును దృశ్యత్వ మున్న దనుట హేతూపనయనము. అందువలన జాగ్రదవస్థయందును అసత్యములని నిగమము. అనుమాన ప్రమాణముచే నొక సంగతిని నిశ్చయింపవలసి వచ్చినపుడు ప్రతిజ్ఞాది పంచావయవ సహితమగు వాక్యమును బ్రయోగించి తర్కము ద్వారా నిశ్చయింతురు.

స్వప్నజాగరితే స్థానే హ్యేకమాహు ర్మనీషిణః
భేదానాంహి సమత్వేన ప్రసిద్ధేనైవ హేతునా. 5

గ్రాహ్యగ్రాహక రూపమౌ, హేతువు సమమౌటచే
స్వప్న జాగ్రదవస్థలున్, రెం డొక్కటంద్రు పండితుల్.

వివ:- స్వప్నములోను జాగ్రతలోను విషయములు గ్రాహ్యములు. వాటికి మనస్సు గ్రాహకము. భావములు ఈ రెండింటి యవస్థా భేదములో నున్నవేగాని వాస్తవమునకు ఒకటే యని భావము. స్వప్నములో మనస్సు తనంతట తానే విషయములను గ్రహించును. జాగ్రదవస్థలో చక్షురాది బహిరింద్రియములద్వారా గ్రహించును. స్వప్నవిషయములు కొంత కాలమే యుండును. జాగ్రదాది విషయములు కొంత కాలమే యుండును.

ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా
వితథైః సదృశాః సన్తో వితథా ఇవ లక్షితాః. 6

ఏది యాదిన్ దుదిన్ లేదో, యది నేఁడును లేనిదే
ఎండమావు లట్టి దానిన్. సత్యమ ట్లెంచ్రు మూఢులు.

సప్రయోజనతా తేషాం స్వప్నే విప్రతిపద్యతే
తస్మా దాద్యంత వత్త్వేన మిథ్యైవ ఖలుతే స్మృతాః. 7

స్వప్నవస్తుల్ మెలకువ, నుపయోగింప నట్టులన్
మెల్కువనున్న వస్తువు, లుపయోగింప వా కలన్.

జాగ్రద్వస్తులు కలలో, నుపయోగింప కుండుటన్
వాని కాత్యంతము గల్గుఁ గావున నవ్వి మిథ్యలు.

అపూర్వం స్థానిధర్మోహి యథా స్వర్గ నివాసినాం
తానయం ప్రేక్షతే గత్వా యథ్త్రైవేహ సుశిక్షితః. 8

దివ్యులన్ బోలెఁ గ్రొత్తవి, చూచుట ద్రష్ట నైజము
స్వప్న ద్రష్ట పోయి గాంచుఁ గ్రొత్తవి శిక్షితుం డటున్.

వి:- జాగ్రదవస్థయందు వలెను స్వప్నావస్థ యందు దివ్యులను వారి సహస్రాక్షత్వము మొదలగు క్రొత్త విషయములను జూచుట స్వప్న ద్రష్ట స్వభావము. దేశాంతర మార్గమందు శిక్షితుండైనవాఁడు ఆ మార్గములను జూచునట్లు స్వప్న ద్రష్ట ఆయా స్వప్న స్థానములకుఁబోయి క్రొత్తవగు చిత్త వికల్పములను జూచును. కాన స్వప్నావస్థకు జాగ్రదవస్థకు భేదము లేదు గాన కలలోని పదార్థములవలె జాగ్రత్పదార్థములును మిథ్య అని భావము.

స్వప్నవృత్తావపి త్వంత శ్చేతసా కల్పితం త్వసత్
బహిశ్చేతో గృహీతం సద్దృష్టంవై తథ్య మేతయోః 9

స్వప్నమందు నంతర్మన, స్సంకల్పిత మసత్తమగున్
బాహ్యేంద్రియోప లబ్ధంబుల్ సత్తౌ, నీ రెండు మిథ్యలు.

వివః- కలలో మనస్సుచే కల్పింపఁబడినవి అసత్యములు. బాహ్యేంద్రియము
లచే కల్పింపఁబడినవి కొంత కల సత్యములవలె నున్నను మిథ్యలేయని
భావము.

జాగ్రద్వృత్తా వపిత్వంత శ్చేతసా కల్పితం త్వసత్
బహిశ్చేతో గృహీతం సద్యుక్తం వైతథ్య మేతయోః. 10

జాగ్రద్దశ నంతర్దర్శన, సంకల్పిత మసత్తగున్
బాహ్యేంద్రి యోపలబ్ధంబుల్, సత్తౌ నీ రెండు మిథ్యలు.

ఉభయోరపి వైతథ్యం భేదానాం స్థానయోర్యది
కఏతాన్‌బుధ్యతే భేదాన్ కోవై తేషాం వికల్పకః. 11

స్వప్న జాగ్ర దభేదంబుల్ మిథ్యలే యని యన్నచో
ఎవ్వఁ డీభేద మెఱుంగున్, నిర్మాత వాని కెవ్వఁడు.

కల్పయత్యాత్మ న్యాఽఽత్మాన మాత్మాదేవ స్స్వమాయయా
సఏవ బుధ్యతే భేదానితి వేదాన్త నిశ్చయః. 12

స్వమాయచేఁ బరమాత్మ, కల్పించున్ దనచేఁ దనున్
ఆతండె భేద మెఱుంగున్, వేదాంత నిశ్చయం బిది.

వికరో త్యపరాన్ భావా నన్తశ్చిత్తే వ్యవస్థితాన్
నియతాంశ్చ బహిశ్చిత్త ఏవం కల్పయతే ప్రభుః. 13

లోలోననున్న శబ్దాదిన్ బైనున్న బాహ్య వస్తులన్
కల్పించి యీశుఁడే చేయున్, బాహ్యాభ్యంతర చిత్తుడై.

చిత్త కాలాహియేఽన్తస్తు ద్వయ కాలాశ్చ యేబహిః
కల్పితా ఏవ తే సర్వే విశేషో నాన్యహేతుకః. 14

ఊహలో నెవ్విలో నుండెఁ బైనుండె వేఱొక ప్డవి
అవెల్లఁ గల్పితంబులు, లేదు భేదంబు రెంటికిన్.

వివ:- మనస్సులోఁ గల్పనాకాలమున నున్న భావములును అవే యివి యని మఱొక సమయమున తలచి చూచిన పదార్థములును రెండును మనస్సుచేఁ గల్పితములే గాన వానికి భేదము లేదు కాన స్వప్నమందు వలె జాగ్రదవస్థ యందును గల్పింపబడెను. ఆ భావములు మిథ్య లని భావము. జాగ్రదవస్థలో అదివఱకు చూచిన వానిని మనస్సు తలచును గాన రెండు సమానములే.

అవ్యక్తావివ యేంతస్తు స్ఫుట ఏవ చ యే బహిః
కల్పితా ఏవతే సర్వే విశేష స్త్వింద్రియాంతరే.

అవ్యక్తంబులు లోనివి, పై భావంబులో వ్యక్తమౌ
అవెల్లఁ గల్పితం బగు, నింద్రియంబులె భిన్నముల్.

వివ:- లోని భావములు అవ్యక్తముగా నుండును. వానిని మనస్సను నింద్రియము గ్రహించును. పై భావములను చక్షురాది బహిరింద్రియములు గ్రహించును గాన నింద్రియంబులందే గాని కల్పనలో భేదము లేదు గాన జాగ్రద్భావములును స్వప్నమువంటివే యని భావము.

జీవం కల్పయతే పూర్వం తతో భావాన్ పృథగ్విధాన్
బాహ్యా నాధ్యాత్మికాం శ్చైవ యథా విద్య స్తథా స్మృతిః. 16

ముం దాత్మ జీవుని, నాపైని, బా హ్యాధ్యాత్మిక భావముల్
వేర్వేఱగూర్చు, జీవుండౌ, విద్యఁబట్టి స్మృతుల్ గనున్.

అనిశ్చితా యథా రజ్జు రంధకారే వికల్పితా
సర్ప ధారాదిభి ర్భావై స్తద్వదాత్మా వికల్పితః. 17

చీకటిన్ ద్రాడు గన్గొని, పాముగా నీటి ధారగా
భ్రమించునట్లు భ్రమింతు, రాత్మన్ దేహాదికంబుగా.

నిశ్చితాయాం యథారజ్జ్వాం వికల్పో వినివర్తతే
రజ్జురేవేతి చాద్వైతం తద్వదాత్మ వినిశ్చయః. 18

త్రాడని నిశ్చయింపఁగా, సర్పాది భ్రమ పోవును
త్రాడే యిదని యద్వైత, మౌ, నిట్లె యాత్మ దార్ఢ్యమౌ.

ప్రాణాదిభి రనన్తైశ్చ భావైరేతై ర్వికల్పితః
మాయైషాతస్య దేవస్య యయా సమ్మోహిత స్స్వయమ్. 19

ప్రాణా ద్యనంతభావాల, గల్పింపఁబడె నాత్మయే
ఇది యాదేవు మాయ, తా; మోహింపఁబడె దానిచే.

ప్రాణా ఇతి ప్రాణవిదో భూతానీతి చ తద్విదః
గుణా ఇతి గుణవిద స్తత్త్వా నీతి చ తద్విదః. 20

ప్రాణమం దాత్మఁ బ్రాణజ్ఞుల్, భూతంబు లంద్రు భౌతికుల్
గుణంబు లంద్రు గుణజ్ఞుల్, తత్త్వంబు లంద్రు తాత్వికుల్.

వివ:- ఆత్మను వైశేషికాదులు ప్రాణము అందురు. భూతములే యాత్మ యని లోకాయతికులు, గుణంబు లని సాంఖ్యులు; తత్వంబు, ఆత్మ అవిద్య, శివుడు అను మూడు తత్వములు అని శైవు లందురు.

పాదా ఇతి పాదవిదో విషయా ఇతి తద్విదః
లోకా ఇతి లోకవిదో దేవా ఇతి తద్విదః. 21

పాదములంద్రు పాదజ్ఞుల్ విషయాలంద్రు తత్త్వజ్ఞుల్
లోకంబులంద్రు లోకజ్ఞుల్ దేవజ్ఞుల్ దేవులందురు.

వివ:- విశ్వాదు లాత్మకు పాదములు అని కొందఱు అందురు. విషయంబులని కామశాస్త్రరచయిత లగు వాత్స్యాయనాదులు, భూర్భువః స్వర్గకములే ఆత్మ యని పౌరాణికులు, అగ్నీంద్రాదులు ఫలదాత లగు దేవు లని వేదోక్త దేవతాకాండీయులు.

వేదా ఇతి వేదవిదో యజ్ఞా ఇతి చ తద్విదః
భోక్తేతి చ భోక్తృవిదో భోజ్య మితి చ తద్విదః. 22

వేదంబు లంద్రు వైదికుల్, యజ్ఞంబు లంద్రు యాజ్ఞికుల్
భోక్త లంద్రు భోక్తృవిదుల్, భోజ్యజ్ఞుల్ భోజ్య మందురు.

వివ:- ఆత్మను యజ్ఞంబుగా బోధాయనాదు లందురు. ఆత్మను భోక్తగా సాంఖ్యులు. భోజ్యమే ఆత్మ యని సూపకార్ధులు అందురు.

సూక్ష్మఇతి సూక్ష్మవిదః స్థూలఇతి చ తద్విదః
మూర్తఇతి మూర్తవిదోఽమూర్తఇతి చ తద్విదః 23

సూక్ష్మమందురు సూక్ష్మజ్ఞుల్ స్థూలజ్ఞుల్ స్థూలమందురు
మూర్తజ్ఞుల్ మూర్తమందు రమూర్తమందురు తజ్ఞులు.

వివ:- స్థూలజ్ఞులని లోకాయతికులలోఁ గొందఱు త్రిశూలాదిధారి చక్రధారి యని మూర్తములుగా ఆగమికులు, అమూర్తము లని శూన్యవాదు లందురు.

కాలఇతి కాలవిదో దిశ ఇతి చ తద్విధః
వాదాఇతి వాదవిదో భువనానీతి తద్విదః. 24

కాలజ్ఞుల్ కాలమందురు, దిశలంద్రు దిశావిదుల్
వాదజ్ఞుల్ వాదమందురు, లోకంబులంద్రు లౌకికుల్.

వివ:- ఆత్మను జ్యోతిష్కులు కాలమని, దిశలె పరమార్ధమని స్వరోదవాదులు వాదజ్ఞులు ధాతువాదమని, మంత్రవాదమని అందురు. చతుర్దశ లోక ములె యని భువనకోవిదు లందురు.

మనఇతి మవోవిదో బుద్ధిరితి చ తద్విదః
చిత్తమితి చిత్తవిదో ధర్మాధర్మౌ చ తద్విదః. 25

మనస్సంద్రు మనోవేత్తల్, బుద్ధిజ్ఞల్ బుద్ధియందురు
చిత్తజ్ఞల్ చిత్తమంద్రు, ధర్మాధర్మాలంద్రు తద్విదుల్.

వివ:- మనస్సె ఆత్మయని లోయతికులు ఒకరు. కొందరు బుద్ధియని చిత్త మని యంద్రు, ధర్మాధర్మములె పరమార్థములని మీమాంసకులు.

పంచవింశక ఇత్యేకే షడ్వింశ ఇతి చాపరే
ఏకత్రింశక ఇత్యాహు రనన్త ఇతిచాపరే. 26

ఇర్వదైదని కొందఱు, కొంద ఱిర్వదియాఱని
ముప్పదొక్కటని కొంద, ఱనంతమంద్రు కొందఱు.

వివ:- మూలప్రకృతి యగు ప్రధానము, మహత్తు, అహంకారము, శబ్ద స్పర్శ రూప రస గంధము లను తన్మాత్ర లైదు, జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు, పంచభూతములు, మనస్సు, పురుషుడు ఇట్లు ఇర్వదైదని సాంఖ్యులు, పాతంజలులు ఈశ్వరుని ఎక్కువగా అంగీక రించి ఇర్వదాఱని యందురు. పాశుపతులు రాగము, అవిద్య, నియతి, కాలము, కళ, మాయ అను నాఱింటిని ఎక్కువగా అంగీకరించి ముప్ప దొక్కటి యందురు. పదార్థములభేదము నియతముగాదు గాన అనంత మని కొందరు.

లోకాన్ లోకవిదః ప్రాహురాశ్రమా ఇతి తద్విదః
స్త్రీ పుం నపుంసకం లైంగా, పరాంపర మథాపరే. 27

లోకంబులంద్రు లౌకికు, లాశ్రమాలంద్రు తద్విదుల్
స్త్రీ పుం నపుంసకుల్ లైంగుల్, పరాపరులు కొందరు.

వివ:- లోకరంజనమె తత్త్వమని లౌకికులు, వర్ణాశ్రమములె పరమార్థము అని దక్ష ప్రభృతులు, స్త్రీ పుం నపుంసక రూప శబ్దజాతమె తత్త్వమని, వైయాకరణులు, పరబ్రహ్మము, అపరబ్రహ్మమునని కొందఱు.

సృష్టిరితి సృష్టివిదో లయఇతి చ తద్విదః
స్థితిరితి స్థితివిద స్సర్వే చేహతు సర్వదా. 28

సృష్టియంద్రు సృష్టివేత్తల్, లయజ్ఞుల్ లయమందురు
స్థితిజ్ఞుల్ స్థితియందు, రన్నియు నాత్మలోనివే.

వివ:- ఈ మత భేదములన్నియుఁ గల్పనావస్థయందు ఆత్మయందె కల్పింపఁబడుచున్నవి. కాని యాత్మమాత్రము కల్పింపబడుచున్నదిగాని తెలియునది. ఆత్మగూడ గల్పింపబడిన దన్నచో ఈ మతభేదములకు ఆధారము లేకపోవలసి వచ్చును.

యం భావం దర్శమేద్యస్య తం భావంసతు పశ్యతి
తం చావతి సభూత్వాఽసౌ తద్గ్రహస్సముపైతితమ్. 29

ఏయే భావము గుర్వాదుల్, బోధింతౌవాడదే గనుస్
అదే యట్లై వానిఁబ్రోచు, నాపట్టుదలె వానికౌ.

ఏతైరేషోఽ పృథగ్భావై పృథగేవేతి లక్షితః
ఏవం యో వేదతత్త్వేన కల్ప యేత్సోఽవిశంకితః 30

వీని కంటెన్ వేఱుకాని, యాత్మన్ వేఱంద్రు మూఢులు
తత్త్వ మిట్లెఱుంగు వారు, కల్పింత్రు శంకలేకిటుల్

స్వప్నమాయే యథాదృష్టే గంధర్వం నగరం యథా
తథా విశ్వమిదం దృష్టం వేదాంతేషు విచక్షణైః. 31

కలల్ మాయలు గంధర్వ, పురంబుల్ గాంచునట్టులన్
ఈ విశ్వమెల్ల నేర్పరుల్, వేదాంతంబుల గాంతురు.

వివ-: నేహ నానాస్తి కిం చన (ఇందు భిన్నభావము లేదు). నతుత ద్వితీయమస్తి (ఆత్మకంటె రెండవదిలేదు) మొదలగునవి వేదాంతవాక్యములు.

ననిరోధోన చోత్పత్తి ర్నబద్ధో నచ సాధకః
నముముక్ష ర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా. 32

సృష్టియేన్ ప్రలయంబేని, సాధకుండేని బద్ధుఁడేన్
ముముక్షువేని ముక్తుఁడేన్, లేరులే రిదె సత్యము.

వివ:- త్రాడును సర్పాదులుగా భ్రమించుటవల్ల త్రాడు సర్పాదులుగఁ గనిపించెను. త్రాడును త్రాడుగా చూచుటవల్ల సర్పాది భావ కల్పన లేనట్లే ఆత్మను ప్రాణ ప్రపంచాదులుగా భ్రమించుటవల్ల ప్రాణాది కల్పన కలుగుచున్నది. ఆత్మను ఆత్మగా చూచుటవల్ల సృష్టి కాదు. ప్రళయాదులుగా జూచుటవల్ల సృష్టి లేదు, ప్రళయాదులును లేవని భావము. ఆత్మకంటె భిన్నమైనది లేనేలేదు గాన ఆత్మకంటె వేఱు సృష్ట్యాదులుగ గల్పించుటకు వీలులేదని తెలియునది.

భావై రసద్భిరేవాయ మద్వయేన చ కల్పితః
భావా అప్యద్వయేనైవ తస్మాద ద్వయతా శివా. 33

త్రాడున లేని సర్పాది, భావంబుల్ సర్పమే యిది
యను నద్వైత భావంబున్, కల్పింపఁ బడునట్టులన్.

ప్రాణాది భావముల్ గూడ, గల్పింపబడె నాత్మనే
కావున నిందు నద్వైత భావమొండె శుభం బగున్.

నాత్మభావేన నానేదం నస్వేనాపి కథంచన
నపృథఙ్నాపృథక్కించి దితి తత్త్వవిదో విదుః. 34

ప్రాణాదికంబు నాత్మగా, భావన చేయుటన్, మఱి
యాత్మ యొక్కటియే గాన, నియ్యెడలేదు ద్వైతము.

ఆత్మన్ ప్రాణాదికంబుగా, భ్రమించుటన్ స్వయంబుగా
ప్రాణాదుల్ లేనివేగాన, లేదెట్లు ద్వైత మిందును.

ప్రాణాదిగాఁగ నాత్మయే, కల్పితంబౌట నాత్మకున్
ఏది భిన్న మభిన్నంబున్, గావంద్రు తత్త్వవేత్తలు.

వీతరాగ భయక్రోధై ర్మునిభిః వేదపారగైః
నిర్వికల్పో హ్యయం దృష్టః ప్రపంచోపశమోఽద్వయః. 35

రాగంబు భీతి క్రోధంబు, లేక మననశీలురౌ
వేదాంతజ్ఞుల్ నిర్వికల్ప, మద్వైత మాత్మ ఁగాంతురు.

తస్మాదేవం విదిత్వైన మద్వైతే యోజయే త్స్మృతిం
అద్వైతం సమనుప్రాప్య జడవల్లోక మాచరేత్. 36

కాన నిట్లాత్మ నెఱింగి, యద్వైత మెంచఁగావలెన్
అద్వైతియై జడున్బోలె భువిన్ జరింపగా వలెన్.

నిస్తుతి ర్నిర్నమస్కారః నిస్స్వధాకార ఏవచ
చలాచల నికేతశ్చ యతి ర్యాదృచ్ఛికో భవేత్. 37

స్తుతుల్ నమస్కృతుల్ స్వధా, కార్యంబుల్ వీడి దాంతుడై
మేనే యాత్మమె యిల్లుగా, యదృచ్ఛన్ దృప్తిఁ బొందనౌ.

తత్త్వ మాధ్యాత్మికం దృష్ట్వా తత్త్వం దృష్ట్వాతు బాహ్యతః
తత్త్వీభూత స్తదారామ స్తత్త్వా దప్రచ్యుతో భవేత్. 38

ఆధ్యాత్మ తత్త్వమున్ బాహ్య, తత్త్వంబున్ గాంచి తత్త్వమై
తత్త్వ విహారియై జీవి, తత్త్వంబునుండి జాఱడు.

ఇది

చర్ల గణపతిశాస్త్రి అనువదింపఁబడిన

గౌడపాదీయ కారికల యందు

వైతథ్యము

రెండవ ప్రకరణము.

—/—

# అద్వైత ప్రకరణమ్

## మూడవ ప్రకరణము

ఉపాసనాశ్రితో ధర్మో జాతే బ్రహ్మణి వర్తతే
ప్రాగుత్పత్తే రజం సర్వంతేనాసౌ కృపణ స్స్మృతః. 1

బ్రహ్మంబున్ జెందెదనంచు, నుపాసన చేయుచున్
జగత్తుగఁ దోచు బ్రహ్మ, నభిమానించు జీవుడు.

ఈ జగత్తుగఁ దోఁచక, మున్ను సర్వంబు బ్రహ్మమే
బ్రహ్మంబుస్ బొంద నెంచుటన్, జీవుండు దీనుడయ్యెను.

అతోవక్ష్యా మ్యకార్పణ్య మజాతి సమతాం గతం
యథా నజాయతే కించి జ్జాయమానం సమంతతః. 2

కాన, నెల్లెడఁ బుట్టెడు, నదెల్లన్ బుట్టనట్టులన్
దైన్యమున్, జాతియున్ లేని సమంబౌ బ్రహ్మఁ జెప్పెదన్.

ఆత్మా హ్యాకాశవ జ్జీవై ర్ఘటాకాశై రివోదితః
ఘటాదివచ్చ సంఘాతై ర్జాతావేత న్నిదర్శనమ్. 3

ఆకాశ మొక్కటేయైన ఘటాద్యుపాధి భిన్నమై
తోచున ట్లాత్మ యొక్కటే, జీవ భేదతఁ గన్పడున్.

భూమ్యాది భూతసంఘాలన్ ఘటాదుల్ పుట్టునట్టులన్
పరమాత్మంబు నుండియె, జీవాత్మల్ పుట్టు వొందును.

ఘటాదిషు ప్రలీనేషు ఘటాకాశదయో యథా
ఆకాశే సంప్రలీయంతే తద్వజ్జీవా ఇహాత్మని. 4

ఘటాదుల్ పోవగా ఘటా, కాశాదు లాకసంబులో
లీనమౌనట్టు లాత్మలో, జీవులు లీనమయ్యెడున్.

యథై కస్మిన్ ఘటాకాశే రజోధూమాదిభి ర్యుతే
న సర్వే సంప్రయుజ్యంతే తద్వ జ్జీవా స్సుఖాదిభిః. 5

ధూళ్యాదిచేక ఘటా, కాశంబు నిండనన్నియున్
నిండనిట్లొక్క జీవుని, సుఖాదుల్ పొందరందఱు

రూపకార్య సమాఖ్యాశ్చభిద్యంతే తత్రతత్రవై
ఆకాశస్య నభేదోఽస్తి తద్వజ్జీవేషు నిర్ణయః. 6

ఘటాద్యుపాధిచే రూపుల్, పనుల్ పేరులు వేఱగున్
కాని యాకాశమొక్కటే, యిట్లె జీవులతత్త్వమున్.

నాకాశస్య, ఘటాకాశో, వికారావయవౌ యథా
నైవాఽఽత్మన స్సదాజీవో వికారావయవౌ తథా. 7

ఘటాకాశాదులాకాశ, వికారావయవంబులు
కానట్లు, జీవికా, డాత్మ వికారావయవంబులు.

యథాభవతి బాలానాం గగనం మలినం మలైః
తథాభవత్యబుద్ధానామాత్మాఽపి మలినో మలైః 8

మేఘాదిచే బాలురకున్, మిన్ను రంగుగఁ గన్పడున్
రాగాదిచేనజ్ఞులకు నాత్మ చెడ్డగకన్పడున్.

మరణే సంభవే చైవ గత్యాగమనయోరపి
స్థితౌ సర్వ శరీరేషు ఆకాశేనావిలక్షణః 9

మేనులందెల్లనుంటయు, పరలోకగతాగతుల్
చావుఁబుట్టులు జీవికిన్, ఘటాకాశ గుణాభముల్.

సంఘాతా స్స్వప్నవత్సర్వే ఆత్మమాయా విసర్జితాః
ఆధిక్యే సర్వసామ్యేవా నోపపత్తిర్హి విద్యతే 10

స్వప్నంబువోలె దేహాదుల్, సర్వమవిద్యఁ బుట్టును
భౌతికంబౌట వానికి, లేదాధిక్యము సామ్యమున్.

రసాదయోహియే కోశా వ్యాఖ్యాతా స్తైత్తిరీయకే
తేషామాత్మా పరోజీవః ఖంయథా సంప్రకాశితః 11

తైత్తిరీయోక్తమో నన్నమయాది కోశపంక్తికిన్
పరమాత్మయె జీవంబై, యొప్పునాకాశమట్టులన్.

ద్వయోర్ద్వయోర్మధుజ్ఞానే పరంబ్రహ్మప్రకాశితం
పృధివ్యాముదరే చైవయధాఽఽకాశః ప్రకాశితః 12

పొట్టన్ భూమినినాకాశ, మున్నట్లు బ్రహ్మజీవులన్
బ్రహ్మంబె యుండునయ్యది, యామధుబ్రాహ్మణోక్తము.

జీవాత్మనో రనన్యత్వ మభేదేన ప్రశస్యతే
నానాత్వం నింద్యతే యచ్చ తదేవహి సమంజసమ్. 13

జీవబ్రహ్మల కైక్యంబు నభేదంబుగ మెత్తురు
శ్రుతిన్ భేదము నిందింప, బడె; నియ్యదె యుక్తము.

వివ:- నతు తద్ద్వితీయమస్తి (రెండవదిలేదు) "ద్వితీయాద్వై భయంభవతి (రెండవదానివల్ల భయముగుచున్నది.)" మృత్యోః సమృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి. ఇందు భిన్నముగ చూచువాడు మృత్యువునుండి మృత్యువును పొందును. ఇత్యాది శ్రుతులు భిన్నత్వమును నిందించునవి.

జీవాత్మనోః పృథక్త్వం యత్ప్రాగుత్పత్తేః ప్రకీర్తితం
భవిష్యద్వృత్త్యాగౌణం తన్ముఖ్యత్వం హినయుజ్యతే. 14

సృష్టికిన్మున్ను జీవాత్మల్, వేఱనుశ్రుతి భావియౌ
దృష్టిచే గౌణమేగాని, ముఖ్యంబనుటయొప్పదు.

వివ:- యతోవా ఇమాని భూతాని జాయంతే (ఏ ఆత్మనుండి ఈ ప్రాణులు పుట్టుచున్నవో) యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా "అగ్నినుండి నెరసులు పుట్టుచున్నవి" ఇత్యాదులు అభేదశ్రుతులు.

అన్నమును వండుచున్నారు. అనువాక్యమువలె భావిదృష్టినిబట్టి గౌణముగాఁ జెప్పుచున్నవిగాన పారమార్థకదృష్టితో ముఖ్యముగా చెప్పబడినవి గావు. వీనిని ఆకాశమునుండి ఘటాకాశము పుట్టునను వాక్యములవంటి వానినిగా గ్రహింపవలయునని భావము.

మృల్లోహవిస్ఫులింగాద్యైః సృష్టిర్యాచోదితాఽన్యథా
ఉపాయస్సోఽవతారాయ నాస్తిభేదః కంథంచన. 15

అగ్నికణాదులన్ బోల్చి, చెప్పిన సృష్టి యంతయున్
జీవబ్రహ్మైక్యబోధయే, భేదమెట్లును లేదటన్.

ఆశ్రమాస్త్రివిధాహీన మధ్యమోత్కృష్ట దృష్టయః
ఉపాసనోపదిష్టేయం తదర్థ మను కంపయా 16

హీనమధ్యోత్తమదృష్టిన్, మూడు వర్ణాశ్రమంబులన్.
హీనాద్యుపాసనార్థమై దయతో శ్రుతి చెప్పెను.

హీనమధ్యోత్తమములగు వైశ్యక్షత్రియ బ్రాహ్మణులు వర్ణాశ్రమ ధర్మోపాసనల ద్వారా జీవ బ్రహ్మైక్యమును బొందుటకై దయతో సోపానములను జెప్పెను గాన వాస్తవమునకు నిందును భేదములేదని భావము.

స్వసిద్ధాంత వ్యవస్థాసు ద్వైతినో నిశ్చితాదృఢం
పరస్పరం విరుధ్యన్తే తైరయం నవిరుధ్యతే. 17

తమసిద్ధాంతమె సత్యం, బని ద్వైతుల్ స్థిరాత్ములై
యన్యోన్యంబున్ విరోధింత్రు, తద్విరుద్ధము కాదిది.

వివ:- అద్వైతమతమున అంతయునొక్కటే. ఆత్మకంటె వేరులేదు. శరీరము వంటి యాత్మాద్వైతముతో కరచరణాదులవంటి ద్వైతమతములు విరోధింప వని భావము.

అద్వైతం పరమార్థోహి ద్వైతం తద్భేద ఉచ్యతే
తేషాముభయథాఽద్వైతం తేనాయం నవిరుధ్యతే. 18

అద్వైతమొండె సత్యంబు ద్వైతమద్వైత భేదము
సత్యాసత్యత, ద్వైతులై, వారుంట నవిరుద్ధమౌ.

వాస్తవదృష్టితోఁజూడ, నద్వైతమొండె సత్యము
ద్వైతమన్నది యద్వైతమందు వేరొక్కభేదము.

వాస్తవాస్తవ దృష్టిన్ ద్వైతుల్ ద్వైతమె గాంతురు
కాన నద్వైతమున్ వారి కెట్లున్గాదు విరుద్ధము.

వివ:- అద్వైతులకు సత్యదృష్టిలో నద్వైతమె యున్నది. అసత్యదృష్టిలో ద్వైతమున్నది. సమాధిలోను మూర్ఛలోను చిత్తచలనము లేదుగాన అద్వైతమె యుండును. కాన అద్వైతభేదమె ద్వైతము. ద్వైతులకుమాత్రముఁ సత్యదృష్టిలోను, అసత్యదృష్టిలోను ద్వైతమె యున్నది. వారు భ్రాంతులు గాన ద్వైతదృష్టి యున్నది. అద్వైతులు భ్రాంతిలేనివారుగాన అద్వైతదృష్టి యున్నది. కాన ద్వైతులు భ్రాంతులగుటచే భ్రాంతిలో ద్వైతమునె చూచుచున్నారు. కాన అద్వైతము ద్వైతులకు విరుద్ధముఁగాదు. వారికి భ్రాంతి లేనప్పుడు అద్వైతమును జూతురని భావము.

మాయయాభిద్యతే హ్యేతన్నా న్యథాఽజం కథంచన
తత్త్వతోభిద్యమానేహి మర్త్యతా మమృతం వ్రజేత్. 19

మాయచేతనె యద్వైత, మియ్యది ద్వైతమయ్యెను
కానిచోఁ బుట్టువేలేని, బ్రహ్మంబు ద్వైతమెట్లయ్యెన్.

మాయచేఁగాక తత్వమున్, బట్టియె ద్వైతమొందుచో
అమృతరూపమే బ్రహ్మ, మర్తత్వమొంది పోవును.

అజాతస్యైవ భావస్య జాతి మిచ్ఛన్తి వాదినః
అజాతో హ్యమృతోభావో మర్త్యతాం కథమేష్యతి. 20

పుట్టువే లేనిదానికి ద్వైతుల్ వాంఛింత్రు పుట్టుకన్
చావుఁబుట్టుల్‌లేని తత్త్వ, మెట్లు మర్త్యత్వమొందును.

నభవత్యమృతం మర్త్యం నమర్త్యమమృతం తథా,
ప్రకృతే రన్యథాభావో న కథంచి ద్భవిష్యతి. 21

మర్త్యం బమృతమెట్లౌ, నమృతంబు మర్త్యమెట్లగున్
ప్రకృతిసిద్ధమౌ తత్త్వ, మెట్లును మార్పుచెందదు.

స్వభావేనామృతో యస్య భావో గచ్ఛతి మర్త్యతామ్
కృతకేనామృత స్తస్య కథం స్థాస్యతి నిశ్చలః 22

స్వభావంబుగ ద్వైతి క, మృతంబు మర్త్యమైనచో
కృతకంబైన యమృతం బెట్లుండు నిశ్చలంబుగన్.

భూతతోఽ భూతతోవాఽపి సృజ్యమానే సమా శ్రుతిః
నిశ్చితం యుక్తియుక్తంచ యత్తద్భవతి నేతరత్. 23

మిథ్యయన్నన్ సత్యమన్నన్ సృష్టిశ్రుతి సమంబగున్
సృష్ట్యుక్తి గౌణమేయంచు నిశ్చితం, బదె యుక్తము.

వివ:- ఆత్మ పుట్టుకలేనిది సృష్టినిజెప్పు శ్రుతివాక్యము, గౌణము, మిథ్య అను వారి మతమునను, సృష్టిసత్యమైనదే యనువారి మతమునను సృష్టినిబోధించు శ్రుతివాక్యము సమముగానే యుండును, ఆత్మ భిన్నమైనదిగాన సృష్టి బోధకశ్రుతి గౌణార్థమేగాని ముఖ్యార్థకముగాదని నిశ్చయించినది యుక్తి యుక్తముగాని యన్యముగాదని భావము.

నేహనానేతి చామ్నాయా దింద్రోమాయాభిరిత్యపి
అజాయమానో బహుధా మాయయా జాయతే తుసః. 24

"లేదిందు భేద" మింద్రుండు మాయలం దోచులోనగు
శ్రుతులంబట్టి పుట్టని, యాత్మయె మాయఁ బుట్టును.

వివ:- "నేహనాస్తినానాస్తి" ఇందు భేదములేదు."ఇంద్రోమాయాభి, పురురూప ఈయతే"ఇందు నామరూపాది మిథ్యాభిమానములచే బహురూపుడై గమ్యుడు ఇత్యాదులు శ్రుతులంబట్టి యాత్మపుట్టుకలేని దయ్యుమాయచేఁ బుట్టునుగాని స్వభావంబుగా పుట్టుననరాదని భావము.

సంభూతే రపవాదాచ్చ సంభవః ప్రతిషిధ్యతే
కోన్వేనం జనయేదితి కారణం ప్రతిషిధ్యతే. 25

వికృతిన్గొల్వ మహాంధర కారమేనని చెప్పుటన్
వికార రూపమౌజన్మ, నిషిద్ధమయ్యె నాత్మకున్.

వివ:- తతోభూయ ఇవతేయ ఉసంభూత్యాం రతాః అను శ్రుతి సంభూతిని అనఁగా వికృతిని కార్యబ్రహ్మమును ఉపాసించువారికి మహాంధకారనరకప్రవేశమును శ్రుతి చెప్పుచున్నది.

మాయచేఁదక్క జీవునిన్ వాస్తవంబుగా నెవ్వడు
పుట్టించున్గాన నాత్మకు హేతుత్వము నిషిద్ధము.

వివ :- త్రాడుసందు భ్రాంతిచే ఆరోపింపబడిన పాము వివేకమువలనపోఁగా ఇంక ఆసామును ఎవరు పుట్టింతురు ? మాయచే ద్వైతరూపుడగుజీవునిపుట్టుక గలిగెను. గాన అవిద్యపోగా జీవుడునశింపగా ఆ నశింపనిజీవుని వాస్తవముగా నేది పుట్టించును? కాన ఆత్మకు జీవుని పుట్టుకలో వాస్తవికమైన కారణము లేదనిభావము.మాయచే ద్వైతభాస కలుగుచున్నది. గాన ద్వైతమనునది లేనే లేదనిభావము.

సఏషనేతి నేతీతి వ్యాఖ్యాతం నిహ్నుతే యతః
సర్వమగ్రాహ్య భావేన హేతునాఽజం ప్రకాశతే. 27

అదిది కాదుకాదను పూర్వోక్తుల్ గప్పిపుచ్చుటన్
ఆత్మదుర్బోధ మంచున్, హేతుచేఁ దెలుపంబడెన్.

వివ :- నేతినేతి అని శ్రుతి. ఆత్మపూర్వోక్తమగు మూర్తామూర్తములు గాదని కప్పిపుచ్చుటచే ఆత్మ దెలుపరానిదను హేతువుచేతనే ఆత్మస్వరూప మూహింప బడినదిగాన ఆత్మ అద్వైతమేగాని ద్వైతస్వరూపమైనది గాదని భావము.

సతోహి మాయయా జన్మ యుజ్యతే నతుతత్త్వతః
తత్త్వతోజాయతే యస్యజాతం తస్యహి జాయతే. 28

మాయచే నన్నియున్బుట్టు, దత్త్వంబువల్లబుట్టవు
తత్త్వతన్ బుట్టునన్నచో బుట్టున దజమెట్లగున్

వివ :- ఆత్మము అజమన్నపుడు అదితత్త్వముగా పుట్టుట విరోధించును గాన మాయచేతనేగాని తత్త్వముగాఁ బుట్టుననియనరాదని భావము.

అసతో మాయయాజన్మ తత్త్వతో నైవజాయతే
వంధ్యాపుత్రోన తత్త్వేన మాయయానాఽపి జాయతే. 29

తత్వాన మాయచేఁ గాని, యసత్తు పుట్టు టెట్టులు
తత్వాన మాయచే గానిఁ గొడ్రాలిబిడ్డ పుట్టునే

వివ:- అసత్తు నుండి సత్తు పుట్టునని యసద్వాదుల మతము

యథా స్వప్నే ద్వయాభాసం స్పందతే మాయయా మనః
తథా జాగ్రద్ద్వయా భాసం స్పందతే మాయయామనః 30

కలలో నెట్లు చిత్తంబు మాయచే ద్వైత మయ్యెనో
యట్లె మెల్కువ చిత్తంబు మాయచే ద్వైతమయ్యెను.

వివ:- త్రాడు పామువలె దోచునట్లు అద్వైతము ద్వైతము వలె ప్రకాశించు చున్నదని భావము.

అద్వయంచ ద్వయాభాసం మనస్స్వప్నే నసంశయః
అద్వయంచ ద్వయాభాసం తథాజాగ్ర న్నసంశయః. 31

అద్వైతమయ్యుఁ గలలో ద్వైతంబై మది భాసిలున్
అద్వైతమయ్యు మెల్కువన్ ద్వైతంబై మది భాసిలున్.

మనోదృశ్య మిదంద్వైతం యత్కించి త్సచరాచరం
మనసో హ్యమనీభావే ద్వైతం నైవోప లభ్యతే. 32

ఈ చరాచర మంతయు మనస్సు చూచు ద్వైతమే
మనస్సె యమనస్కంబై పోవన్ ద్వైతము దోపదు.

వివ:- సంకల్పించునట్టి మనః కార్యమే చరాచరరూప ద్వైత ప్రపంచ మని భావము.

ఆత్మ సత్యానుబోధేన సంకల్పయతే యథా
అమనస్తాంతదా యాతి గ్రాహ్యాభావే తదగ్రహమ్. 33

ఆత్మ సత్యము తెలియన్ సంకల్పింపదు చిత్తము
అమనస్కంబయి యది వస్తుల్ లేమిన్ గ్రహింపదు.

అకల్పక మజం జ్ఞానం జ్ఞేయాభిన్నం ప్రచక్షతే
బ్రహ్మజ్ఞేయ మజం నిత్య మజేనాజం విబుధ్యతే. 33

సంకల్పంబుల్ లేని యా జ్ఞానంబున్ జ్ఞేయ మందురు
బ్రహ్మంబె జ్ఞేయ మజం బా యాత్మయే, యాత్మ దెల్పును.

వివ:- సూర్యుడు తాను స్వయముగా దన ప్రకాశముచే ప్రకాశించునట్లు జ్ఞాన స్వరూపమౌ నాత్మ తన్ను దానే తెలుపునని భావము.

నిగృహీతస్య మనసో నిర్వికల్పస్య ధీమతః
ప్రచారస్సతు విజ్ఞేయ స్సుషుప్తేఽన్యోన తత్సమః. 34

వికల్పంబుల్ విడి లొంగి జ్ఞానమొప్పు మనోగతుల్
గాంచనౌ, సుషుప్తి వేఱు; దానివంటిదిగాదిది.

వివ:- జ్ఞానావస్థ యగు సమాధి యందలి మనస్సు కంటెను సుషుప్తి యందలి మనస్సు వేఱు. సమాధ్యవస్థ మనస్సు వంటిది సుషుప్తిలోని మనస్సు గాదని భావము.

లీయతేహి సుషుప్తే తన్నిగృహీతం న లీయతే
తదేవ నిర్భయం బ్రహ్మ జ్ఞానా లోకం సమంతతః. 35

మనస్సణంగె సుషుప్తి నణంగలే దటంచుటన్
అణంచఁబడ్డదే బ్రహ్మ, నిర్భీతి జ్ఞాని వ్యాపియున్.

అజ మనిద్ర మస్వప్న మనామక మరూపకమ్
సకృ ద్విభాతం సర్వజ్ఞం నోపచారః కథంచన. 36

జన్మ, నిద్ర, కలల్, పేర్లు రూపు లేక సమస్తమై
జ్ఞానమై యెప్డు భాసించు బ్రహ్మన్ జేయున దేదికన్.

సర్వాభిలాప విగత స్సర్వ చింతా సముత్థితః
సుప్రశాంత స్సకృజ్జ్యోతి స్సమాధి రచలోఽభయః.

సమస్త వాగతీతంబై సంకల్ప శూన్యమై యది
నిర్భీతి, జ్యోతి స్థాయియై, శాంతమై ధ్యాన గమ్యమౌ.

గ్రహోన తత్ర నోత్సర్గ శ్చింతాయత్రనవిద్యతే
ఆత్మ సంస్థం తథా జ్ఞాన మజాతి సమతాం గతమ్.

గ్రహించుట, త్యజించుట, సంకల్పంబును లేవటన్
జ్ఞానం బాత్మనె భాసిల్లు, జన్మ లేకసమంబౌ.

అస్పర్శ యోగోవై నామ దుర్దర్శ స్సర్వ యోగిభిః
యోగినో బిభ్యతి హ్యస్మా దభయే భయ దర్శినః.

అస్పర్శ యోగమౌ దీనిన్, గాంచలే రెల్లయోగులు
నిర్భయాత్మన్ భయంబెంచు యోగుల్ భీతిల్లి గాంచరు.

మనసో నిగ్రహాయత్త మభయం సర్వయోగినామ్
దుఃఖ క్షయః ప్రబోధశ్చాప్యక్షయా శాంతి రేవచ.

మనస్సు నిగ్రహించుచో దుఃఖాంత మభయంబును
జ్ఞానంబు నిత్యశాంతియు యోగులకున్ వశంబగున్.

ఉత్సేక ఉదధేర్యద్వ త్కుశాగ్రేణైక బిందునా
మనసో నిగ్రహ స్తద్వద్భవే దపరి ఖేదతః.

దర్భపుల్లన్ నీరు తోడి, సంద్ర మింకించుటంబలెన్
ఖేద మొందక దీక్షతో, నిగ్రహింపవలెన్ మదిన్.

ఉపాయేన నిగృహ్ణీయా ద్విక్షిప్తం కామభోగయోః
సుప్రసన్నం లయేచైవ యథాకామో లయస్తథా. 41

కామభోగంబులన్ జిక్కి, నిద్రన్ జొక్కు మనస్సును
జయింపవలె యుక్తిచే, నిద్రయున్ గామమట్టిదే.

దుఃఖంసర్వ మనుస్మృత్య కామభోగా న్నివర్తయేత్
అజం సర్వ మనుస్మృత్య జాతం నైవతు పశ్యతి. 42

ద్వైతంబెల్ల దుఃఖమంచు భోగ వాంఛన్ విడన్వలెన్
సర్వంబు బ్రహ్మగా నెంచన్, ద్వైతమన్నది గాంచడు.

లయే సంబోధయే చ్చిత్తం విక్షిప్తిం శమయే త్పునః
స కషాయం విజానీయా త్సమప్రాప్తం న చాలయేత్. 43

నిద్రింపన్ జిత్తమున్ లేపు, మాశన్ జిక్కనణంచుము
రాగమున్నన్ జిత్తమంద్రు, సామ్య మొందన్ గదల్పకు.

నాఽఽస్వాదయే త్సుఖం తత్ర, నిస్సంగః ప్రజ్ఞయా భవేత్
నిశ్చలానిశ్చరం చ్చిత్త మేకాకీ కుర్యా త్ప్రయత్నతః. 44

సౌఖ్యంబులన్ దగుల్కొకు, ప్రజ్ఞన్ సంగము వీడుము
మెల్లనన్ జాఱు చిత్తంబు నొంటిగా నిల్పు దీక్షతో.

యదాన లీయతే చిత్తం నచ విక్షిప్యతే పునః
అనింగన మనాభాసం నిష్పన్నం బ్రహ్మ తత్తథా. 45

నిద్రన్ మున్గక, కోర్కెలన్ జిక్కక నిల్చు చిత్తము
దీపింపక చలింపక బ్రహ్మమైపోవు నత్తఱిన్.

స్వస్థం శాంతం సనిర్వాణ మకథ్యం సుఖ ముత్తమం
అజ మజేన జ్ఞేయేన సర్వజ్ఞ పరిచక్షతే. 46

స్థాణు, శాంతము మోక్షంబై యవాచ్యానంత మాత్మమున్
జన్మ లేమి నజం బండ్రు, సర్వజ్ఞ మండ్రు జ్ఞానతన్.

నకశ్చి జ్జాయతే జీవ స్సంభవో౽స్య నవిద్యతే
ఏతత్త దుత్తమం సత్యం యత్రకించి న్నజాయతే, 47

పుట్టదు జీవ మెద్దియు, నాత్మకున్ లేదు మూలము
ఇందేది పుట్టకుండుటే యుత్తమంబైన సత్యము.

ఇది

చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన

గౌడపాదీయ కారికల యందు

అద్వైతము

తృతీయ ప్రకరణము.

—/—

# అ లా ం త శా ం తి

## యను

## నా ల్గ వ ప్ర క ర ణ ము

జ్ఞానేనాకాశ కల్పేన ధర్మాన్యో గగనోపమాన్
జ్ఞేయాభిన్నేన సంబుద్ధ స్తం వందే ద్విపదాం వరమ్. 1

ఆకాశతుల్య ప్రజ్ఞతో, నాకాశతుల్య ధర్మముల్
జ్ఞేయాభేదతఁ దెల్పిన పురుషోత్తము మ్రొక్కెదన్.

వివ:- జ్ఞాన, జ్ఞేయ, జ్ఞాతృ భేదములు లేని పరమార్థ దర్శనము ఈ ప్రకరణమున జెప్పబడుననని, యిందు పురుషోత్తమునకు నమస్కారము ద్వారా సూచింపబడుచున్నది. అలాతము అనగా నిప్పు. అజ్ఞాన మను నిప్పుఁగాఱవిచే యాతనపడు పరమేశ్వరాభిన్నమైన జీవికి అద్వైత, స్వాభిన్న పరమేశ్వర జ్ఞానముద్వారా శాంతి గూర్చునది గాన నీ ప్రకరణమునకు అలాత శాంతి యను పేరు గలిగినది.

అస్పర్శయోగో వై నామ సర్వసత్త్వసుఖో హితః
అనివాదోఽవిరుద్ధశ్చ దేశిత స్తం నమామ్యహమ్. 2

అవివాదా విరుద్ధంబై దేహికిన్ మేలు సౌఖ్యమున్
గూర్చు నస్పర్శయోగంబున్ బోధించు దేవు మ్రొక్కెదన్.

భూతస్యజాతి మిచ్ఛంతి వాదినః కేచిదేవహి
అభూతస్యాపరే ధీరా వివదంతః పరస్పరమ్. 3

ఉన్నదె పుట్టునందురు, ద్వైతుల్ కొంద, ఱికొక్కరు
లేనిదె పుట్టునందురు, వాదింతు రిట్టు లొండొరుల్.

వివ:- ఉన్న వస్తువులు పుట్టునని సాంఖ్యులు, లేని విశేషములు పుట్టునని
నైయాయికులు, వైశేషికులు.

భూతం నజాయతే కించి దభూతం నైవ జాయతే
వివదంతో ద్వయాహ్యేవ మజాతిం ఖ్యాపయంతితే. 4

ఉన్న దెద్దియుఁ బుట్టదు, పుట్టదు లేని దెన్నఁడున్
అని వాదించుచున్న ద్వైతుల్ బోధింత్రు పుట్టకుండుటన్.

ఖ్యాప్యమానా మజాతిం తైరనుమోదామహే వయం
వివదామో న తైఃసార్ధ మవివాదం నిబోధత. 5

వారు తెల్పు జన్మ లేమి మేము నంగీకరింతుము
వివదింపము వారితో నవివాదం బిదే సుడీ.

అజాతస్యైవ ధర్మస్య జాతి మిచ్ఛంతి వాదినః
అజాతో హ్యమృతో ధర్మో మర్త్యతాం కథమేష్యతి. 6

పుట్టనిదానికే జన్మ నంగీకరింత్రు గొందఱు
పుట్టని చావని ధర్మ, మెట్లు మర్త్యత్వ మొందును.

నభవ త్యమృతం మర్త్యం నమర్త్య మమృతం తథా
ప్రకృతే రన్యథా భావో న కథంచి ద్భవిష్యతి. 7

మర్త్యంబమృత మెట్లౌ, నమృతంబు మర్త్య మెట్లగున్
ప్రకృతి సిద్ధమౌ తత్త్వ మెట్లును మార్పు చెందదు.

స్వభావే నామృతో యస్య ధర్మోగచ్ఛతి మర్త్యతాం
కృతకే నామృత స్తస్య కథం స్థాస్యతి నిశ్చలః. 8

స్వభావంబుగ ద్వైతి కమృతంబు మర్త్యమైనచో
కృతకంబైన యమృతం బెట్లుండు నిశ్చలంబుగన్.

సాంసిద్ధికీ స్వాభావికీ సహజా అకృతా చ యా
ప్రకృతిస్సేతి విజ్ఞేయా స్వభావం నజహాతియా. 9

సంసిద్ధంబై స్వభావంబై సహజం బకృతంబునై
యిట్టుల్ ప్రకృతి యొప్పారు స్వభావంబది వీడదు.

వివ:- యోగసిద్ధివలనఁ గలిగిన యణిమాదులు సంసిద్ధ ప్రకృతివి. వాని స్వభావము మారదు. అగ్న్యాదుల యుష్ణత్వాదులు స్వభావ ప్రకృతి. పక్ష్యాదుల యాకాశ గమనాదికము సహ (కూడ) (జ) పుట్టిన ప్రకృతి జలాదులు నిమ్నప్రదేశాది గమనము అకృత (ఎవరిచేతను పల్లమునకుఁ బోవునట్లు చేయబడకయే యున్న) ప్రకృతి. ఇవి యన్ని దేశ కాలములచే భేదము కలిగినను మార్పుచెందవు.

జరామరణ నిర్ముక్తా సర్వే ధర్మా స్వభావతః
జరామరణ మిచ్ఛం తవశ్చ్యంతే తన్మనీషయా. 10

స్వభావంబుగ సర్వాత్మల్, జరామరణశూన్యముల్
జరామృత్యు లున్నవంచున్, గూలెద రవ్వి గోరుచున్.

కారణం యస్య వై కార్యం కారణం తస్య జాయతే
జాయమానం కథమజం భిన్నం నిత్యం చ తత్. 11

హేతువె కార్యమై పుటు, నన్నన్ హేతువె పుట్టును
పుటునది యజం బెట్లౌ; భిన్నమున్ నిత్య మెట్లగున్.

వివ:- మట్టి మొదలగు హేతువులే కుండ మొదలగు కార్యములుగా పుట్టునని సాంఖ్యులు. హేతువులగు స్త్రీ ధనాదులు మహదాది కార్యములుగా

మారుననని వారందురు. అపుడు హేతువులే పుట్టునన్నమాట. కాన పుట్టుకకు కారణమైన ప్రధానాదులు అజములు (పుట్టునవి) ఎట్లగును? వారు ప్రధానాదులు పుట్టవందురు. భిన్నము లన సావయవములు గాన సావయవములు నిత్యము లెట్లగును. ఇవియే స్వవచన విరోధములు.

కారణాద్యద్యనన్యత్వమతః కార్యమజం యది
జాయమానాద్ధివై కార్యాత్ కారణం తే కథం ధ్రువం. 12

హేతువున్ కార్యమొండైనన్, కార్య మజంబె యెట్లగున్
పుట్టినకార్యమున్ హేతు, వొండైనన్ ధ్రువ మెట్లగున్.

అజాద్వై జాయతే యస్య దృష్టాంత స్తస్య నాస్తివై
జాతాచ్చ జాయమానస్య న వ్యవస్థా ప్రసజ్యతే. 13

అజంబునుండి జన్మించు, నన్నన్ దృష్టాంత మొప్పదు
పుట్టినదానిచేఁ బుట్టు, నన్నన్ వ్యవస్థ యుండదు.

వి:- పుట్టనిదాని నుండి పుట్టు ననుదానికి దృష్టాంత ముండదు, దృష్టాంతము లేనిచో అది యుక్తియుక్తముగాదని భావము. పుట్టినదాని నుండి పుట్టు నన్నచో ఆ పుట్టినది ఒకదాని నుండి, అది యింకొక దానినుండి, అది వేరొక దానినుండి పుట్టునని యిట్లు అనంతముగా చెప్పవలసి వచ్చును గాన వ్యవస్థ లేకపోవలసివచ్చునని భావము.

హేతోరాదిః ఫలం యేషా మాదిర్హేతుః ఫలస్యచ
హేతోః ఫలస్య చానాదిః కథంతై రుపవర్ణ్యతే. 14

ధర్మాదికాదియౌ మేనుల్, ఫలంబేన్ మేని హేతులౌ
ధర్మాదు లాదియేన్, ఫలహేతు లనాదు లెట్లగున్.

వి:- హేతువులైన ధర్మాధర్మాదుల కాదియైన దేహాదులే ఫలం బనియు, ఫలంబులైన దేహాదులకు హేతువులైన ధర్మాధర్మాదులే యాది అనియు

అవి యనాదు లనియు గొందఱందురు. అట్టులన్నచో ఫలమైన దేహాదులును, హేతువులైన ధర్మాదులును అనాదులనుట విరుద్ధమని భావము.

హేతోరాదిః ఫలంయేషా మాదిర్హేతుః ఫలస్యచ
తథాజన్మ భవేత్తేషాం పుత్రాజ్జన్మపి తుర్యథా. 15

ధర్మాది కాదియౌ మేనుల్, ఫలంబేన్, మేని హేతులౌ
ధర్మాదు లాదియన్నచో, బుత్రుచే; దండ్రి పుట్టును.

సంభవే హేతుఫలయో రేషితవ్యః క్రమస్త్వయా
యుగప త్సంభవేయస్మా దసంబంధో విషాణవత్. 16

ముందు హేతువు తర్వాత ఫలం బొప్పము, కానిచో
కొమ్ములకున్ బలెన్ కార్య కారణభావ మొప్పదు.

వివ:- ఒక్కమాటే పుట్టిన రెండు కొమ్ములలో ఒకటి కారణము, రెండవది కార్యము అనుటకు తగనట్లే హేతుఫలము లొకమాటే పుట్టకున్నచో వానికి, కార్యకారణ సంబంధము తగదని భావము.

ఫలాదుత్పద్య మానస్స న్నతే హేతుః ప్రసిద్ధ్యతి
అప్రసిద్ధః కథంహేతుః ఫలముత్పాదయిష్యతి. 17

ఫలంబునుండి పుట్టెడు, హేతు వెందును జూడము
ఆ యప్రసిద్ధ హేతువు, పుట్టించున్ ఫల మేగతిన్.

వివ:- కుందేటి కొమ్ముపలెఁ గారణము లేని కార్యము పుట్టదని భావము.

యది హేతోః ఫలాత్సిద్ధిః ఫలసిద్ధిశ్చ హేతుతః
కతర త్పూర్వ నిష్పన్నం యస్యసిద్ధి రపేక్షయా. 18

ఫలంబునుండి హేతువున్, హేతువునుండి ఫలంబును
జౌనన్న నేది ముందౌను, సిద్ధించున్ దేనిచే నేది.

అశక్తి రపరిజ్ఞానం క్రమకోపోఽధవా పునః
ఏవంహి సర్వథా బుద్ధై రజాతిః పరిదీపితా. 19

చెప్ప నశక్యమన్నచో మౌఢ్యంబో యక్రమంబౌయౌ
ఇట్లెల్ల విధిఁ, బ్రబుద్ధుల్, జన్మలేమినె చెప్పిరి.

బీజాంకురాఖ్యో దృష్టాంతః సదాసాధ్యసమో హి సః
నహిసాధ్య సమో హేతుః సిద్ధౌ సాధ్యస్య యుజ్యతే. 20

చెట్టు ముందా విత్తు ముందా పోలిక సాధ్యతుల్యమౌ
సాధ్య సమాన హేతువు, సాధ్యసిద్ధిని జేయదు.

వివ:- చెట్టు ముందా విత్తు ముందా అను పోలికయు ఫల హేతువుల కార్య కారణభావము అంగీకరింతు మనుదాని కిది ఖండనము. సాధ్యసమము అన్నది జాతులలో ఒకటి. ఉదా॥ బెడ్డ ఎట్టిదో ఆత్మయు నట్టిదే అయినప్పుడు ఆత్మ యెట్టిదో బెడ్డయు నట్టిదే యగు ఆత్మ క్రియగలది అనునది సాధ్యము. ఇట్లు బెడ్డగూడ సాధ్యమే. పక్ష దృష్టాంతాదులకు ప్రకృత మగు సాధ్యముతో తుల్యమును ఆపాదించుట సాధ్య సమము.

పూర్వాపరా పరిజ్ఞాన మజాతేః పరిదీపకమ్
జాయమానాద్ధివై ధర్మా త్కథంపూర్వం నగృహ్యతే. 21

వెన్కముం దెఱుఁగమియే జన్మాభావము దెల్పును
పుట్టుచున్న డానివల్లన్ ముందుది యెట్లెఱుంగున్.

వివ:- హేతుఫలముల ముందు వెనుకలు తెలియకపోవుటయే జన్మ లేదను దానిని తెలుపును. పుట్టుచున్న దన్నచో ఆ పుట్టుచున్న దానివల్ల వాని పిదప దిటి తెలియకెట్లుండును.

స్వతో వాపరతో వాపిన కించి ద్వస్తు జాయతే
సదసత్సదసద్వాపి న కించి ద్వస్తు జాయతే. 22

పరుచేగాని తనంతంగాని యెవ్వియు బుట్టవు
ఆ రెంటి జంటచేఁగాని వస్తు లెవ్వియుఁ బుట్టవు.

వివ:- మట్టివల్ల గుండ పుట్టుచున్నది. తండ్రివలన గొడుకు పుట్టెను. ఇత్యాదులు మూఢ వ్యవహారములు. అవి వ్యవహారము మాత్రమే. అజ్ఞానముచే నట్లుతోచుచున్నది. ఉన్నది ఉన్నదిగాన పుట్టు టెట్లు సంభ వించును? లేనిది లేదు గావున లేనిది పుట్టుట యెట్లు సంభవించును? కాన పుట్టుట చచ్చుట మొదలగు వ్యవహారములు మూఢ వ్యవహారములు. ఆత్మయే మాయచే అట్లు వ్యక్తమగుచున్న దని తెలియునది.

హేతుర్న జాయ తేఽనాదేః ఫలంచాపి స్వభావతః
ఆది ర్న విద్యతే యస్య తస్యహ్యాది ర్న విద్యతే. 23

ఫలంబునుండి హేతువున్ దానై ఫలంబుఁ బుట్టవు
దేనికి నాది యుండదో దానికి నాది యుండదు.

వివ:- హేతుఫలము లనాదు లందురు. దాని కిది ఖండనము. హేతు ఫలము లనాదులనుటచే హేతుఫలములకు జన్మాభావమె యంగీకరించినట్లయిన దని భావము.

ప్రజ్ఞప్తే స్సనిమిత్తత్వ మన్యథా ద్వయ నాశతః
సంక్లేశ స్యోపలబ్ధేశ్చ పరతంత్రాస్తితా మతా. 24

జ్ఞానంబు విషయాఢ్యంబౌ, గానిచో నెల్ల లేనివౌ
దుఃఖాద్యనుభవం బుంటన్, బాహ్యవస్తువు లున్నవి.

వివ:- ఆత్మకంటె వేఱుగా బాహ్య పదార్థము లున్న వను నితర మతస్థుల వాదము అనువదింపబడుచున్నది.

ప్రజ్ఞప్తేస్స నిమిత్తత్వ మిష్యతే యుక్తిదర్శనాత్
నిమిత్తస్యా నిమిత్తత్వ మిష్యతే భూతదర్శనాత్. 25

యుక్తినిబట్టి జ్ఞానంబు విషయాఢ్య మటన్నచో
సత్యదృష్టిని జూచుచో విషయంబులు.

వివ:- భ్రాంతిచే త్రాడు పాముగా కనిపించుచున్నట్లు భ్రాంతిచే ఆత్మగా లేనివె బాహ్య విషయములుగా గనిపించుచున్నవి గాని సత్యదృష్టితోఁ జూచినచో ఆత్మయెగాని ఆత్మకంటె వేఱుగా బాహ్యవిషయములు లేవని భావము.

చిత్తం న సంస్పృశత్యర్థం నార్థాభాసం తథైవచ
అభూతో హి యతశ్చార్థో నార్థాభాస స్తతః పృథక్. 28

వస్తులన్ జిత్త మంటదు, వస్త్వాభాసము నంటదున్
వస్తువులేమిఁ జిత్తంబున, వస్త్వాభసము నొక్కటే.

వివ:- బాహ్యవస్తువులే లేనపుడు చిత్తమింక దేని నంటును ? కలలోఁ జిత్తమె యా యా వస్తువులుగాను భాసించుచున్నది. గావున వస్త్వాభాసమును గూడఁ జిత్త మంటదు. వస్త్వాభాసము చిత్తము నొక్కటే. చిత్తామే యవస్తువులుగా నగుచున్నదని భావము.

నిమిత్తం న సదాచిత్తం సంస్పృశత్య ధసుతిషు
అనిమిత్తో విపర్యాసః కథం తస్య భవిష్యతి. 27

చిత్తం బెప్డున్ విషయాళిన్, త్రికాలంబుల నంటదు
శబ్దాదుల్ లేమి మదికిన్, విపర్యాసము నెట్లగున్.

వివ:- విపర్యాసము శబ్దాది విషయము లేనప్పుడు చిత్తము శబ్దాది విషయనులుగా ఆభాసించును. భూతభవిష్యద్వర్తమాన రూపములగు త్రికాలములందును చిత్తము విషయంబులను అంటదు గాన విపర్యాసమే సంభ

వింపదు. కాన ఈ విపర్యాసమును బట్టి యవిపర్యాసము అంగీకరింపరా దని భావము. శబ్దాది విషయములు లేకున్నను శబ్దాది విషయములుగా భాసించుట భ్రాంతుని చిత్తమున కిది స్వభావము. ఇంతవరకు బాహ్యార్థము విజ్ఞానముచే నిషేధింపబడినది.

తస్మాన్న జాయతే చిత్తం చిత్తదృశ్యం నజాయతే
తస్య పశ్యంతి యేజాతం ఖేవై పశ్యన్తి తే పదమ్. 28

కాన చిత్తంబు పుట్టదు, చిత్తదృశ్యాలు పుట్టవు
చిత్తంబు పుట్టుటన్ గాంచువా రాకాశమె గాంతురు.

విప:- విజ్ఞానవాదులు సర్వము క్షణికము,శూన్యము,దుఃఖమందురు. అనాత్మలు ప్రతిక్షణము నశించును. వారి వాద మిది. సత్యదృష్టితోఁ జూచుటవల్ల చిత్తాదులకుఁ బుట్టుక లేదు. సర్వము క్షణికము అన్నపుడు ఏ క్షణమున కా క్షణము నశించి యే క్షణమున కా క్షణమును పుట్టును. కాన చిత్తము క్షణక్షణము పుట్టు ననవలసి వచ్చును. అట్లు క్షణ క్షణము చిత్తము పుట్టి నను క్షణికవాదులు చిత్తస్వరూపముఁ దెలియక ఆకాశముపై చూతురు. బాహ్యవాదులకంటె విజ్ఞానవాదులు ఇంకను సాహసికు లని భావము. చూచుచునే సర్వము శూన్య మను శూన్యవాదు లింకను సాహసికులు.

అజాతం జాయతే యస్మా దజాతిః ప్రకృతి స్తతః
ప్రకృతే రన్యథా భావో న కథంచి ద్భవిష్యతి. 29

అజంబు పుట్టదు గాన బ్రకృతి జన్మ లేనిది
ప్రకృతిసిద్ధమౌ తత్త్వ మెట్లును మార్పు చెందదు.

విప:- ద్వైతవాదుల మతము ఖండించి స్వమతము తిరిగి సిద్ధాంతము చేయబడినది.

అనాదే రంతవత్త్వంచ సంసారస్య నసేత్స్యతి
అనంతతా చాదిమతో మోక్షస్య న భవిష్యతి. 30

అనాదియైన సంసార మంతముపొంద దెట్టులున్.
ఆదిమోక్షమునకు ననంత తత్వము గల్గదు.

వివ:- అనాదియైన దానికి ఆత్మకు వలె అంతు ఉండదు గాన సంసారమునకు అంతము లేకపోవలసి వచ్చును. ఘటాదులకువలె ఆది గల మోక్షమునకును అంతత్వమే గాని అనంతత్వము సిద్ధింపక పోవలసివచ్చు నని ఆక్షేపణ.

ఆదావంతేచ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా
వితథై స్సదృశా స్సంతోవితథా ఇవ లక్షితాః. 31

ఏది యాదిన్ దుదిన్ లేదో యది నేడును లేనిదే
ఎండమావు లట్టిదానిన్ సత్యమ ట్లెంచ్రు మూఢులు.

సప్రయోజనతా తేషాం స్వప్నే విప్రతిపద్యతే
తస్మా దాద్యంత వత్త్వేన మిథ్యైవ ఖలుతే స్మృతాః. 32

స్వప్నవస్తుల్ మెలుకువ నుపయోగింపనట్టులన్
మెల్కువనున్న వస్తువు లుపయోగింప వా కలన్.

జాగ్రద్వస్తులు కలలో నుపయోగింప కుండుటన్
వాని కాద్యంతముల్ గల్గుంగావున నవ్వి మిథ్యలు.

వివ:-వానినిబట్టి సంసార మోక్షములు పరమార్థములుగావని భావము. సంసార మోక్షములు ఎండమావులలో నీరువంటివని తెలియునది.

సర్వేధర్మా మృషాస్స్వప్నే కాయస్యాంత ర్నిదర్శనాత్
సంవృతేఽస్మిన్ ప్రదేశే వై భూతానాం దర్శనం కుతః. 33

మేనన్ గన్పడుటన్ స్వప్న భావంబులెల్ల మిథ్యలు
సంకోచమైన యి మ్మేనన్ భూతంబు లెట్లు గన్పడున్.

నయుక్తం దర్శనం గత్వాకాలస్యానియమాద్గతౌ
ప్రతిబుద్ధశ్చ వై సర్వ స్తస్మిన్దేశే నవిద్యతే. 34

కాలమితి గతిన్లేమి గలలోఁబోయి చూడరు
మేల్కాంచి యెల్లవారును స్వప్నంపు జోటనుండరు.

వివః- కలలో ఆయా దేశములు చూచుటలో ఆయా దేశములు పోవుటలో నింత కాలములో పోవలయు నని మితము లేకుండఁ జూతురు. కాన వెళ్ళిచూడనక్కరలేదు. మేల్కొన్నపిదవ ఆ ప్రదేశమునందు ఉండరు. కాన కలలు మిథ్యలని భావము.

మిత్రాద్యైశ్చ సహ సమ్మన్త్ర్య సంబుద్ధో న ప్రపద్యతే
గృహీతం చాపి యత్కించిత్ ప్రతిబుద్ధో న పశ్యతి. 35

కలన్ మిత్రాదులన్బల్కి మేల్కొని వారిఁజూడరు
ఏదేది కలలోఁ బొందు, మేల్కొని దాని గాంచరు.

స్వప్నేచా వస్తుకః కాయః పృథగన్యస్య దర్శనాత్
యథాకాయ స్తథాసర్వం చిత్తదృశ్య మవస్తుకమ్. 36

వేఱే మేనొండు చూచుటన్ స్వప్న దేహ మసత్యము
కలన్ మేనట్లు, జాగ్రతన్ జిత్తదృశ్య మసత్యము.

వివః- నాడ్యాదులలో సంచరించి స్వప్నములను జూచు మేను, పరుండి కదల కుండు మేనికంటె వేఱై నది. ఆ మేను అసత్యమైనట్లె జాగ్రదవస్థలోఁ గూడ చిత్తముచేఁ జూడఁబడు సర్వ ప్రపంచమును సత్యము గాదని భావము.

గ్రహణా జ్జాగరిత వ త్తద్ధేతు స్స్వప్న ఇష్యతే
తద్ధేతుత్వాత్తు తస్యైవ సజ్జాగరిత మిష్యతే. 37

జాగ్రతన్ బోలె గాంచుటన్ జాగ్రత్కార్యము స్వప్నము
కాననే స్వప్నద్రష్టకె జాగ్రదవస్థ సత్యమౌ.

వివ:-జాగ్రదవస్థను వలె జూచుటవల్ల స్వప్నము జాగ్రదవస్థ యొక్క కార్యమె యగును. జాగ్రదవస్థకారణము స్వప్నము కార్యము. స్వప్నమునుచూచిన వానికే స్వప్నము అసత్యముగాను ఆ స్వప్నమునుబట్టి జాగ్రదవస్థ సత్యముగాను దోచును. స్వప్నద్రష్టలకు గాక యితరులగు జ్ఞానులకు జాగ్రదవస్థయును అసత్యముగనే తోచునని భావము.

ఉత్పాదస్యా ప్రసిద్ధత్వా దజం సర్వ ముదాహృతం
న చ భూతా దభూతస్య సమ్భవోఽస్తి కథంచన. 38

జన్మయన్నదె లేకుంట నెట్లయున్ జన్మలేనిదౌ
ఉండిన దానినుండి లేకున్నది పుట్టదెట్లును.

వివ:-సర్వము ఆత్మయె, ఆత్మకంటె వేరైనదిలేదు. అది పుట్టనది అని వేదాంతములందుఁ జెప్పబడుటను తత్వ దృష్టితోఁ జూడగా దేనికిని పుట్టుకయన్నది లేనేలేదు. పుట్టుకయే లేనపుడు ఉన్నదానినుండి లేనిది పుట్టుటెట్లు సంభవించును? లేనిది లేనిదే గాన ఉన్నదానినుండి లేనిది ఎట్లు పుట్టును? పుట్టుచున్నది, చనిపోవుచున్నది యిత్యాది వ్యవహారములు మూఢుల వని యెఱుంగునది.

అసజ్జాగరితే దృష్ట్వా స్వప్నే పశ్యతి తన్మయః
అసత్స్వప్నేఽపి దృష్ట్వాచ ప్రతిబుద్ధో న పశ్యతి. 39

అసత్తున్ మెల్కువన్ గాంచి యదే దృష్టిఁ గలన్ గనున్
అసత్తున్ గలలోగాంచి మేల్కాంచి దాని గాంచడు.

వివ:- సర్వ మాత్మయే. అజ్ఞాని తాను చూచు ద్వైత మెల్లయు అసత్తే. అది నిజ మనుకొని దానినే కలలో చూచును. కాన జాగ్రద్దృశ్యములు మిథ్య యని భావము. కలలోజూచినదానిని మెల్కాంచిచూడనట్లు మేల్కొన్న సమయమునఁ జూచినదానిని కలలోఁ జూడఁడనియు తెలియునది.

నా స్త్యసద్ధేతుక మసత్ సదసద్ధేతుకం తథా
సచ్చ సద్ధేతుకం నాస్తి సద్ధేతుక మసత్కుతః ? 40

అసత్తు హేతువై యున్న యసత్తునసత్తు లే దిలన్
సత్తు హేతువుగా నున్న, సత్తు నసత్తు నుండవు.

వివ:-అసత్తు=లేనిది. కుందేటికొమ్ము మొదలగు నసత్తులు హేతువుగా నున్న అసత్తులైన ఆకాశ కుసుమాదులు లేవు. అసత్తులగు కుందేటి కొమ్ములో నగునవి సత్తులగు ఘటాదులకుఁ గారణము గావు. సత్తులగు ఘటాదులు అసత్తులగు గగన కుసుమాదులకును హేతువులు గావు. కాన వ్యవహార ములో మూఢులకు స్వప్న జాగ్రదవస్థలకు గార్యకారణ భావము గనిపించినను తత్త్వ దృష్టితోఁ జూడగా వేనికిని గార్యకారణ భావము లేదని భావము.

విపర్యాసాద్యథా జాగ్ర దచింత్యాన్ భూతవత్స్పృశేత్
తథాస్వప్నే విపర్యాసా ద్ధర్మాం స్తత్రైవ పశ్యతి. 41

మెల్కువన్ భ్రాంతి నచింత్య వస్తువుల్ సత్యంబులన్ బలెన్
తాకునట్లు కలన్ భ్రాంతి నందె యాసత్తువుల్ గనున్.

వివ:-మెల్కువలోఁగూడ అచింత్యవస్తువులను లేనివానినెయున్నవను భ్రాంతితో తాకునట్లు కలలోఁగూడ గాంచునని భావము.

ఉపలమ్భా త్సమాచారా దస్తి వస్తుత్వ వాదినాం
జాతిస్తు దేశితా బుద్ధై రజాతే స్త్రసతాం సదా. 42

సుఖా ద్యనుభవం బౌట. వర్ణాశ్రమాదు లుండుటన్
బాహ్యవస్తువు లున్నవి, యని వాదించు వారికిన్.

పుట్టని తత్త్వము నుండి, యాత్మ నశించునంచు
నెప్డున్ గుందు మూర్ఖులకున్, జ్ఞానుల్ తెల్పిరి జన్మమున్.

వివః-తత్త్వమునకు జన్మాదులు లేకున్నను మూర్ఖుల యనుగ్రహమునకు బ్రహ్మమును జగత్కారణముగా జ్ఞానులు శాస్త్రసూత్రాదులచేబోధించిరని భావము.

అజాతేస్త్రసతాం తేషా ముపలమ్భా ద్వియన్తి యే
జాతిదోషా నసేత్స్యన్తి దోషోఽప్యల్పో భవిష్యతి. 43

సుఖాద్యనుభవంబౌట, ద్వైతమ్ము నొప్పు వారికిన్
జన్మదోషంబు లుండవ, యున్నను స్వల్ప దోషమే.

ఉపలమ్భా త్సమాచారా న్మాయాహస్తీ యథోచ్యతే
ఉపలమ్భా త్సమాచారా దస్తి వస్తు తథోచ్యతే. 44

సుఖాద్యనుభవం బౌట, వర్ణాశ్రమాదు లుండుటన్
మాయ యేన్గున్ జెప్పునట్లు, బాహ్యముల్ చెప్పఁగా బడున్.

జాత్యాభాసం చలాభాసం వస్త్వాభాసం తథైవచ
అజాచల మవస్తుత్వం విజ్ఞానం శాంత మద్వయమ్. 45

పుట్టున, ట్లదరునట్లు, వస్తువు లున్నట్లు తోఁచును
కాని సర్వ మజంబౌచు, స్థిరాద్వైతము శాంతమౌ.

ఏవం నజాయతే చిత్త మేవం ధర్మా అజాస్స్మృతాః
ఏవ మేవ విజానంతో న పతంతి విపర్యయే. 46

ఇట్లె చిత్తంబు పుట్టదు, ధర్మంబు లిట్లె పుట్టవు
ఇట్లే యెఱుంగువా రంధ, కూపంబునందు గూలరు.

ఋజు వక్రాదికాభాస మలాత స్పన్దితం యథా
గ్రహణగ్రాహ కాభాసం విజ్ఞాన స్పన్దితం తథా. 47

కొఱవిం ద్రిప్ప దిన్నసై, వంకరై తోచునట్లుగన్
విషయి విషయముల్ దోచు, నది జ్ఞానంబుస్పందమే.

అస్పందమాన మలాత మనాభాస మజం యథా
అస్పందమానం విజ్ఞాన మనాభాస మజం తథా. 48

తిరుగకున్న కొఱవి నిశ్చలం బజమౌనటుల్
స్పందింపకున్న జ్ఞానంబు నిశ్చల మజమై తగున్.

అలాతే స్పందమానేవై నాభాసా అన్యతో భువః
న తతోఽన్యత్ర నిస్పన్దా న్నాలాతం ప్రవిశంతి తే. 49

కొఱవిన్ ద్రిప్ప వక్రాదు లెందుండొ వచ్చి పుట్టవు
కొఱవి యాగినఁ బోవ వెందొ కొఱవి దూఱవు.

వివ:- వక్రాదులు, వక్రాదులుగా తోచు భావములు.

న నిర్గతా అలాతా త్తే ద్రవ్యత్వాభావ యోగతః
విజ్ఞానేఽపి తథైవస్యు రాభాసస్యావిశేషతః. 50

వక్రాదుల్ ద్రవ్యముల్ గామి గొఱవినుండి గల్గవు
జ్ఞానమం దిట్లె జన్మాదుల్ తోఁచునేగాని లేవెవి.

వివ:- జన్మాదుల్ = జన్మాదులుగాఁదోచు భావములు.

విజ్ఞానే స్పందమానే వై నాభాసా అన్యతో భువః
న తతోఽన్యత్ర నిష్పందా న్న విజ్ఞానం విశంతితే. 51

జ్ఞాన మెల్లెడ జన్మ లెందుండొ [వచ్చి పుట్టవు
విజ్ఞాన మాగినన్ బోవ వెందొ, జ్ఞానంబు దూఱవు.

న నిర్గతా స్తే విజ్ఞానా ద్ద్రవ్యత్వాభావ యోగతః
కార్యకారణ భావా ద్వతోఽచింత్యా స్సదైవతే. 52

జన్మాదుల్ ద్రవ్యముల్ గామి జ్ఞానంబునుండి గల్గవు
కార్య కారణతల్ లేమి సదా యవ్వి యచింత్యముల్.

ద్రవ్యం ద్రవ్యస్య హేతుస్స్యా దన్యదన్యస్య చైవహి
ద్రవ్యత్వ మన్యభావో వా ధర్మాణాం నోపపద్యతే. 53

ఒక్క ద్రవ్యంబునకున్ వేతొక ద్రవ్యము హేతువౌ
తమంతన్ ధర్మముల్ వేత్తె గావు ద్రవ్యంబు లన్యముల్.

వివ:–పటా ద్యవయవ ద్రవ్యంబునకు తంత్వాద్యవయవ ద్రవ్యంబులు హేతువగును కాని ఆత్మలు ద్రవ్యంబులును గావు అన్యములును గావు గాని హేతువులు గావు. అవి భిన్నము గావు. ఒకదానికి వేరొకటి కారణము కార్య మనుట కుదుర దని భావము. రెండు వస్తువు లున్నపుడేగాని ఒకటే యున్నపుడు కారణకార్యత్వ మెట్లగుదురును ? తంతు రూపాదులు పట రూపాదులకు తంతురూప ద్రవ్యముల ద్వారా కారణ మగును గాని స్వతంత్రంబుగాఁ గారణములు గావని భావము.

ఏవం నచిత్తజా ధర్మాశ్చిత్తం వాఽపి న ధర్మజం
ఏవం హేతు ఫలాజాతిం ప్రవిశన్తి మనీషిణః. 54

ధర్మంబుల్ మదిఁ బుట్టవు, ధర్మాలన్ మది పుట్టదు
ఇట్లె ఫలంబు హేతువున్, బరస్పరంబు పుట్టవు.

యావద్ధేతు ఫలావేశ స్తావద్ధేతు ఫలోద్భవః
క్షీణే హేతు ఫలావేశే నాస్తిహేతు ఫలోద్భవః. 55

హేతుఫల దీక్ష యుండునందాక ఫలహేతువౌ
హేతుఫల దీక్ష పోవన్, ఫలహేతుల్ జనింపవు.

వివ:-అట్లుగాక హేతువులందు ఫలములందు పట్టుదల గలవారికి హేతు ఫలములు గల్గున ట్లుండును. ఫలదీక్ష వీడి అద్వైత దర్శనము పొందిన వారికి హేతు ఫలములు అనగా తత్త్వదర్శనమై హేతువు ఫలము అను భేదము లేక సర్వము సమానమై మోక్షరూపమైన యద్వైత దర్శనము గలుగునని భావము.

యావద్ధేతు ఫలావేశ స్సంసారస్తావ దాయతః
క్షీణే హేతుఫలావేశే సంసారం నప్రపద్యతే. 56

హేతుఫల దీక్షయున్న సంసారంబు సుదీర్ఘమై
హేతుఫలదీక్ష పోవన్ సంసార మంత మొందును.

వివ:- సిద్ధి పొందినను పొందకున్నను సముడై ముక్తుడగు నని భావము.

సంవృత్యా జాయతే సర్వం శాశ్వతం నాస్తి తేన వై
సద్భావేన హ్యజం సర్వ ముచ్ఛేద స్తేన నాస్తి వై. 57

వాడుకన్ సర్వమున్ బుట్టు నిందుచే లేదనిత్యము
నిజంబుగ నజంబెల్లన్ ఫలాదినాశ మెట్లికన్.

వివ:-అజ్ఞానమున మామూలు మూఢలోక పద్ధతిని అన్నియునున్నట్లుండును. వాస్తవిక దృష్టిని అంతయుం బుట్టుక లేనిదే గాన ఇంక ఫలహేతువుల నాశముచేసి ముక్తిపొందుట యన్నదెలేదని భావము

ధర్మాయ ఇతి జాయన్తేజాయంతేన తత్త్వతః
జన్మమాయో పమంతేషాం సాచమాయా నవిద్యతే. 58

ధర్మంపు జన్మఁ గల్పింత్రు, వాస్తవంబుగఁ బుట్టవు
తజ్జన్మ మాయ పంటిది, మాయ యన్నను లేనిదే.

వివ:- ధర్మములు=ఆత్మలు వానిధర్మములు పదార్థములు. మాయ=యా, ఏది మా=లేనిదో అది మాయ యని వ్యుత్పత్తి.

యథా మాయామయాద్బీజా జ్జాయతే తన్మయోఽఙ్కురః
నాసౌనిత్యో నచోచ్ఛేదీ తద్వద్ధర్మేషు యోజనా. 59

మాయబీజంబు లందుండి, మొక్కల్ మాయ వెయౌ గదా
నిత్యముల్ గావు, నశింప విట్లె ధర్మంపు జన్మయున్.

నాజేషు సర్వధర్మేషు శాశ్వతా శాశ్వతాభిధా
యత్రవర్ణా నవర్తంతే వివేక స్తత్ర నోచ్యతే. 60

పుట్టని ధర్మమం దెల్లన్, నిత్యానిత్యాఖ్య లొప్పవు
అందు వాక్కుల్ ప్రవర్తింప వటన్ దెల్పియు వ్యర్థము.

యథాస్వప్నే ద్వయాభాసం చిత్తం చలతి మాయయా
తథా జాగ్ర ద్ద్వయాభాసం చిత్తం చలతి మాయయా. 61

కలలో నెట్లు చిత్తంబు, మాయచే ద్వైత మయ్యెనో
యట్లె మెల్కువన్ జిత్తంబు, మాయచే ద్వైతమయ్యెను.

అద్వయంచ ద్వయాభాసం చిత్తం స్వప్నేన సంశయః
అద్వయంచ ద్వయాభాసం తథాజాగ్ర న్నసంశయః. 62

అద్వైత మయ్యుఁ గలలో, ద్వైతంబై మది భాసిలున్
అద్వైతమయ్యు మెల్కువన్, ద్వైతంబై మది భాసిలున్.

స్వప్నదృక్ప్రచరన్ స్వప్నే దిక్షు వై దశసు స్థితాన్
అండజాన్ స్వేదజాన్ వాఽపి జీవాన్ పశ్యతి యాన్సదా. 63

స్వప్నద్రష్ట స్వప్నమందు, దిర్గుచున్ బది దిక్కుళన్
గల్గు స్వేదజ మండజమౌ, జీవులన్ సదా గనున్.

స్వప్నదృక్చిత్త దృశ్యాస్తే నవిద్యంతే తతః పృథక్
తథా తద్దృశ్య మేవేదం స్వప్నదృక్చిత్త మిష్యతే. 64

స్వప్నద్రష్ట మదికన్న, వెల్లన్మదికి వేఱులే
వా స్వప్నద్రష్ట చిత్తంబున్, వాడు గన్గాను దృశ్యమున్.

చరజ్జాగరితే జాగ్రద్దిక్షువై దశ సుస్థితవాన్
అండజాన్ స్వేదజాన్వాఽపి జీవన్ పశ్యతియాన్ సదా. 65

మేల్కొన్నవాడు మెల్కొవన్ దిర్గుచున్ బది దిక్కులన్
గల్గు స్వేదజ మండజ మౌ జీవులన్ సదా గనున్.

జాగ్రచ్చిత్తే క్షణీయాస్తే నవిద్యంతే తతః పృథక్
తథా తదృశ్య మేవేదం జాగ్రత శ్చిత్త మిష్యతే. 66

లేచువాని మదికన్న, వెల్లన్ మదికి వేఱులే
నా లేచువాని చిత్తంబున్, వాడు గన్గాను దృశ్యమున్.

ఉభేహ్యన్యో దృశ్యతే తే కిం తద స్తీతి నోచ్యతే
లక్షణా శూన్య ముభయం తన్మతే నైవ గృహ్యతే. 67

చిత్తజీవుల్ తమ్మె గాంచు, మన్నవా, యుర్వి లేనివే
రెండు ప్రమాణ శూన్యంబుల్, తచ్చిత్తదృష్టి గాంతురు.

యథా స్వప్నమయో జీవో జాయతే మ్రియతేఽపిచ
తథా జీవాఽపి అమీసర్వే భవంతి నభవంతిచ. 68

స్వప్నంపు జీవు లెట్టులు, పుట్టుచుఁ జచ్చుచుండునో
యట్లె యా జీవులన్నియు, నుండును లేక యుండును.

యథా మాయమయో జీవో జాయతే మ్రియతేఽపిచ
తథా జీవామి సర్వే ప్రభవంతి నప్రభవంతి చ. 69

మాయ జీవంబు లెట్టులు, పుట్టుచుఁ జచ్చుచుండునో
యట్లే యా జీవులన్నియు, నుండును లేక యుండును.

యథా నిర్మితకో జీవో, జాయతే మ్రియతేఽపివా
తథా జీవాఅమీ సర్వే, ప్రభవంతి నప్రభవంతి చ. 70

మంత్రౌషదాధుల జీవు, లెట్లు పుట్టుచు జచ్చునో
యట్లె యా జీవు లన్నియు, నుండును లేకయుండును.

న కచ్చిజ్జాయతే జీవః సంభవోఽస్య నవిద్యతే
ఏత త్తదుత్తమం సత్యం యత్ర కించ న్నజాయతే. 71

పుట్టవు జీవు లెవ్వియు, జన్మయే లేదు వీనికిన్
ఎప్పియుఁ బుట్టవన్నదె, యుత్తమమైనసత్యము.

చిత్తస్పందిత మేవేదం గ్రాహ్య గ్రాహకవ ద్వయం
చిత్తం నిర్విషయం నిత్య మసంగ తేన కీర్తితమ్. 72

గ్రాహ్య గ్రాహకమౌ రెండున్, చిత్తచాంచల్య మే యది
చిత్తంబు నిర్విషయంబై, నిత్యమౌట నసంగమౌ.

యోఽస్తికల్పిత సంవృత్యా పరమార్థేన నాస్త్యసౌ
పరతంత్రాభి సంవృత్యా స్యాన్నాస్తి పరమార్థతః. 73

వాడుకన్ గల్పితం బిది, యదార్థంబుగ లేదిది
అన్య నాస్తోక్తిమై యుండు వాస్తవంబుగ లేనిదే.

అజః కల్పిత సంవృత్యా పరమార్థేన నాప్యజః
పరతంత్రాభి నిష్పత్యా సంవృత్యా జాయతేతు సః. 74

అజత్వంబె కల్పితంబు నిజ మజంబె లేదనన్
పరశాస్త్రసిద్ధమైన యజంబె పుట్టు వాడుకన్.

వివ:- సర్వము పుట్టవనునది కల్పింపబడినది యను సిద్ధాంతి వాక్యమునకు అట్లుగాదు సర్వము పుట్టనిదే యన్నదే కల్పితముగాని అజమనుట యథార్థముగాదన్నచో, పరశాస్త్రములందుఅజంబుగాచెప్పబడిన యజమె ద్వైత శాస్త్రజ్ఞుల వాడుక ప్రకారము పుట్టునుగాన, వాడుకనుబట్టి పుట్టునే గాని వాస్తవముగాఁ బుట్టునది గాదని తేలినదని భావము.

అభూతాభి నివేశోఽస్తి ద్వయంతత్ర నవిద్యతే
ద్వయాభావంస బుద్ధైవ నిర్నిమిత్తో నజాయతే. 75

అసత్యాభినివేశంబె కాని ద్వైతంబు లేదటన్
ద్వైతంబు లేమిఁ దెల్సియె నిర్హేతువౌట పుట్టడు.

యథా నలభతే హేతూ నుత్తమాధమ మధ్యమాన్
తథా నజాయతే చిత్తం హేత్వభావే ఫలం కుతః. 76

ఉత్తమాధమ మధ్యంబౌ దేవత్వాద్యాప్తి హేతువుల్
పొందక మదిపుట్టదు హేతులేమి ఫలం బెటుల్.

వివ:- దేవత్వ ప్రాప్తి హేతువు లగు ధర్మములు ఉత్తమములు. మనుష్యత్వ ప్రాప్తిహేతువులగు ధర్మాధర్మములు మధ్యమములు. తిర్యగాది ప్రాప్తి హేతువు లగు ధర్మములు అధమములు.

అనిమిత్తస్య చిత్తస్య యాఽనుత్పత్తిః సమాఽద్వయా
అజాతస్యైవ సర్వస్య చిత్తదృశ్యం హి తద్యతః. 77

హేతువుల్ లేని, పుట్టని సర్వమౌ చిత్త మెపుడున్
సమం బజంబు నద్వైత మవెల్లఁ జిత్తదృశ్యముల్.

బుద్ధ్వాఽనిమిత్తతాం సత్యాం హేతుం పృథగనాప్నువన్
వీతశోకం తథాఽకామ మభయం పద మశ్నుతే. 78

నిర్హేతుత సత్యంబని హేతువున్ వేఱ పొందక
శోకంబు కామమున్ భీతి, లేని సత్పద మొందును.

అద్వైతాభి నివేశాద్ధి సదృశే తత్ ప్రవర్తతే
వస్త్వాభావం సబుద్ధ్యైవ నిస్సంగం వినివర్తతే. 79

అద్వైతమున్నద న్బ్వాన్కి కనుపై మది వర్తిలున్
వస్తుల్ లేమి దెల్సి యట్టి బూన్కిన్ వీడు నసంగతన్.

నివృత్తస్యా ప్రవృత్తస్య నిశ్చలా హి తథాస్థితిః
విషయః సహిబుద్ధానాం తత్సామ్య మజ మద్వయం. 80

ద్వైతమొంద కెటన్ బోని చిత్తమ్ము నిశ్చలం బగున్
జ్ఞానుల్ దానిన్ గాంత్రు; సమ మద్వైతము నజంబదె.

అజ మనిద్ర మస్వప్నం ప్రభాతం భవతి స్వయమ్
సకృద్విభాతో హ్యేవైష ధర్మోదాతు స్వభావతః. 81

అజం బనిద్ర మస్వప్న మదె స్వయం ప్రకాశము
అది యెప్పుడు భాసించు నిది యాత్మస్వభావము.

సుఖమావ్రియతే నిత్యం దుఃఖం వివ్రియతే సదా
యస్య కస్యచ ధర్మస్య గ్రహేణ భగవానసౌ. 82

ఏదేని యొక్క ధర్మంబున్ పట్టుకొంటన్ సుఖంబుగా
గప్పంబడు నీదేవుడు ప్రకటంబౌట కష్టము.

అస్తి నాస్త్యస్తి నాస్తీతినాస్తి నాస్తీతివా పునః
చలస్థిరోభయాభావై రావృణో త్యేవ బాలిశః. 83

ఉన్నాడు లేడు లేడను, నున్నాడు లేడు లేడని
చలస్థిరో భయాత్మలై జడుల్ గప్పుదు రీశుని.

వివ:– ఈశుఁ డున్నాడు అనువారు చలులు. ఘటా ద్యనిత్య వస్తువులకంటె విలక్షణ మగుటవలన వారు చలులు. లేడనువారు స్థిరులు నాస్తికులు. వైనాశికులు. లేడు ఉన్నాడు అనువారు చలులు, అర్ధవైనాశకులు. దిగంబరులు. లేడు లేడనువారు శూన్యవాదులు.

కోట్యశ్చతస్ర ఏతైస్తు గ్రహైర్యాసాం సదా ఆవృతః
భగవానాభి రస్పష్టో యేన దృష్టః ససర్వదృక్. 84

ఉన్నాడు లేడు లోనగు వాదంబు లీశుఁ గప్పెను
ఈశున్ సోకవివి యీశున్, గాంచుచో సర్వద్రష్టయౌ.

ప్రాప్య సర్వజ్ఞతాం కృత్స్నాం బ్రాహ్మణ్యం పదమద్వయం
అనాపన్నాది మధ్యాంతం కిమతః పరమీహతే. 85

ఆది మధ్యాంతముల్ లేని యద్వైత బ్రాహ్మణత్వమున్
సర్వజ్ఞత్వంబు సర్వంబున్ బొంది యింకేమి గోరును.

వివ:– "ఏష నిత్యోమహిమా బ్రాహ్మణస్య" ఇది బ్రాహ్మణుని నిత్యమహిమము అను శ్రుతినిబట్టి ఇదివరకుఁ జెప్పిన సమస్తమైన సర్వజ్ఞత్వ రూపమైన బ్రాహ్మణ్యమును బొందవలయును. దానిని బొందినవాడే బ్రాహ్మణుడు వాఁడింక అగ్నిహోత్రతాదులుచేయఁ గోరవలసినది లేదని భావము.

విప్రాణాం వినయోహ్యేష శమః ప్రాకృత ఉచ్యతే
దమః ప్రకృతి దాంతత్వా దేవం విద్వాన్ శమం వ్రజేత్. 86

శాంతరూపు డౌట, దమంబున్ శమంబున్ వినయంబును
బ్రాహ్మణునికి నైజంబౌ బ్రాహ్మణుం డొందు బ్రాహ్మ్యముల్.

వివ:- బ్రాహ్మణుడు = బ్రహ్మవేత్త.

సవస్తు సోపలంభం చ ద్వయం లౌకిక మిష్యతే
అవస్తు సోపలంభం చ శుద్ధం లౌకికమిష్యతే. 87

వస్తువుల్ గల్గి లబ్ధంబౌ ద్వైతంబున్ మెల్కొ వందురు
వస్తువుల్ లేకయు లబ్ధంబౌ సూక్ష్మంబున్ స్వప్న మందురు.

అవ స్త్వనుపలంభం చ లోకో త్తర మితి స్మృతం
జ్ఞానం జ్ఞేయం చ విజ్ఞేయం సదాబుద్ధైః ప్రకీర్తితం. 88

వస్తుల్ లేక యులబ్ధంబౌ దానిన్ సుషుప్తి యందురు
జ్ఞానమున్ జ్ఞేయమున్ దేవున్ సదాచెప్పి రిటుల్ బుధుల్.

వివ:- జ్ఞానము = జాగ్రత్స్వప్న సుషుప్తములను గూర్చి తెలియజేయునది.
జ్ఞేయము = జాగ్రత్స్వప్న సుషుప్తులు.

జ్ఞానేచ త్రివిధే జ్ఞేయే క్రమేణ విదితే స్వయం
సర్వజ్ఞతా హి సర్వత్ర భవతీహ మహాధియః. 89

జ్ఞానంబున్ మూడు జ్ఞేయంబుల్ గ్రమంబుగ నెఱుంగగా
బుద్ధిమంతుఁ డిటన్ సదా సర్వమై జ్ఞానరూపుఁడౌ.

హేయజ్ఞేయాప్య పాక్యాని విజ్ఞేయా న్యగ్రయాణతః
తేషా మన్యత్ర విజ్ఞేయా దుపలంభ స్త్రిష్వపి స్మృతః. 90

తొల్తన్ హేయమున్ జ్ఞేయంబున్ ప్రాప్యంబుల్ పాక్యముఁగను
అందు జ్ఞేయబ్రహ్మఁ దక్క దక్కినవెల్ల గల్పనల్.

వివ:- హేయములు = జాగ్రత్స్వప్న సుషుప్త రూప లౌకిక విషయములు.
జ్ఞేయము=పరమార్థ మగు బ్రహ్మతత్త్వము.

• ప్రాప్యములు = పాండిత్యము (వేదాంతతాత్పర్యాభిజ్ఞత్వము, అద్వైత విచారము). బాల్యము (దంభదర్పాహంకారరాహిత్యము), యుక్తినిబట్టి శ్రుతార్థమును అనుసంధానించుట యందు నేర్పు, మౌనము. (జ్ఞానాభ్యాసము నిది ధ్యాస రూప మైన మునికర్మ. పాక్యములు = కర్మలచే పరిపక్వమైన రాగద్వేష మోహాదులు.

ప్రకృత్యాకాశవజ్జ్ఞేయాః సర్వేధర్మాఅనాదయః
విద్యతే న హి నానాత్వం తేషాం క్వచ్చన కించన. 91

ఆకాశ మట్లు సర్వాత్మల్ ప్రకృతిచే ననాదులు
వానికెందును నేమియు విభిన్నత్వము లేదిలన్.

ఆది బుద్ధాః ప్రకృత్యైవ సర్వేధర్మాః సునిశ్చితాః
యస్యైవం భవతి క్షాంతిః సోఽమృతత్వాయ కల్పతే. 92

స్వభావసిద్ధముగనే, మున్ముందె యాత్మలెల్లయున్
నిత్యబోధ స్వరూపంబై నిశ్చితరూప మయ్యెను.

తనకై పరుకైగాని బోధించువాంఛ లేకయే
సూర్యుండట్లు తటస్థుండౌ వాడు ముక్తికి నర్హుడౌ.

ఆదిశాంతా హ్యనుత్పన్నాః ప్రకృత్యైవ సునిశ్చితాః
సర్వేధర్మాః సమాభిన్నా అజం సామ్యం విశారదం. 93

సర్వాత్మల్ నిత్యశాంతంబు లజంబుల్ నైజ నిర్వృతుల్
సమంబులు నభిన్నంబుల్ సామ్యమజంబు శుద్ధము.

వైశారద్యంతు వై నాస్తి భేదే చరతాం సదా
భేదనిమ్నాః పృథగ్వాదాస్తస్మాత్తే కృపణాః స్మృతాః. 94

భేద దృష్టిన్ సదా తిర్గు వారికిన్ శుద్ధి గల్గదు
ద్వైతుల్ సంసారబద్ధులు కావునన్ వారు దీనులు.

అజే సామ్యేతు యేకేచిద్భవిష్యంతి సునిశ్చితాః
తేహి లోకే మహాజ్ఞానాస్తచ్చ లోకో న గాహతే. 95

నిశ్చితులై యెవ్వరైన సజంబౌ సామ్యతత్త్వమున్
గన్నన్వారు మహాజ్ఞానుల్ లోకుల కది యందదు.

వివ:— స్త్రీలు మొదలగు వారైనను ఆ సామాన్య తత్త్వమును గన్నచో వారు జ్ఞానులని భావము.

అజేష్వజ మసంక్రాంతం ధర్మేషు జ్ఞానమిష్యతే
యతో న క్రమతే జ్ఞాన మసంగంతేన కీర్తితమ్. 96

పుట్టువొందని యాత్మలన్ బుట్టనిదయి యన్యమౌ
వస్తులన్ సంక్రమింపని యదే జ్ఞాన మనంబడున్.

వివ:— భ్రాంత దృష్టికి గనిపించు నీ జీవాత్మ లన్నియు ఆ అఖండ చైతన్యమునకు ప్రతిబింబములే గాని భిన్నములు గావని భావము.

సూర్యుని వేడి తేజంబున్ దేనిని నంటనట్టులన్
జ్ఞానంబు దేనినంటదు గానన్ జ్ఞాన మసంగమౌ.

వివ:- సూర్యుడు తనకోసముగాని పరులకోసముగాని కాక స్వభావముగ ప్రకాశించును గాన దేనిని ఆ ప్రకాశ మంటదు. సూర్యుడు ప్రకాశ రూపము గాన సూర్యునిదగ్గర నేదియున్న నది ప్రకాశవంతమగునేగాని సూర్యుని ప్రకాశము సూర్యునినుండి వీడి మాయావస్తువుల నంటుట గాదు. అట్లె జ్ఞానమునని భావము.

అణుమాత్రేఽపి వైధర్మ్యే జాయమానే అవిపశ్చితః
అసంగతా సదానాస్తి కిముత ఆవరణచ్యుతిః. 97

అజ్ఞున కిసుమంతేని వైధర్మ్యము జనింపగా
అసంగత్వము లేదెప్డున్ బంధనాశ మికెట్లగున్.

విప:- అజ్ఞుడేదైన నొక వస్తువునకు బుట్టు వంగీకరించును. జన్మ అంగీకరింపగా సంగత్వమెగాని అసంగత్వ మెన్నడు నుండదు. ఇంక దానివల్ల సంసారబంధనాశన ప్రయోజనము గలుగదు. ఏవస్తువునకు జన్మ అంగీకరించినను లక్ష్యసిద్ధి గలుగదని భావము.

అలబ్ధావరణాః సర్వేధర్మాః ప్రకృతి నిర్మలాః
ఆదౌ బుద్ధాస్తథా ముక్తా బుధ్యంత ఇతి నాయకాః. 98

ఆత్మల్ స్వభావ శుద్ధంబుల్ నిత్యబుద్ధ విముక్తముల్
గావునన్ బంధ శూన్యంబుల్ తెలియంబడి యీశులౌ.

క్రమతే నహి బుద్ధస్య జ్ఞానం ధర్మేషు తాపినః
సర్వే ధర్మాస్తథా జ్ఞానం నైతద్ బుద్ధేన భాషితమ్. 99

ఆకాశమువంటి జ్ఞాని, జ్ఞానంబున్ నిఖిలాత్మలున్
అన్యవిషయ మంటవు బుద్ధప్రోక్తము కాదిది.

వివ:- ఈ జ్ఞానము బుద్ధులచే (జ్ఞానులచే) జెప్పబడినది గాదు. ఉపనిషత్తుల యందు మాత్రమే చెప్పబడినది. కాన ఈశ్వర ప్రోక్తము గాన ప్రమాణము. ఇది జ్ఞాన జ్ఞేయ జ్ఞాతృభేదములేని యద్వైతమైన పరమార్థతత్త్వమని భావము.

దుర్దర్శ మతి గంభీర మజం సామ్యం విశారదం
బుద్ధ్వాపద మనానాత్వం నమస్కుర్మో యథా బలమ్. 100

చూడరాని చొరన్‌రాని సమ మజంబు శుద్ధమౌ
నద్వైతతత్త్వముం దెల్సి యథాశక్తిని గొల్తుము.

వివ:- వ్యవహరింపరానిదైనను యథాశక్తిగా వ్యవహారమునకు విషయముగా గ్రహించి నమస్కరించెదమని భావము.

ఓం తత్సత్.

ఇది

చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
గౌడపాద కారికలందు అలాతశాంతిప్రకరణ మను నాల్గవప్రకరణము
సంపూర్ణము.

—/—

